6.12.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:49 విడిప్రతి రూ.2.00లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



# తుఫాన్ చెలగాటా లాడుతూంది!

పదకొండు రోజుల నుంచి ప్రాణాలు తోడేస్తున్నది తుఫాను. ఆంధ్ర ప్రజానీకాన్ని అల్లాడిం చేస్తూంది. అదిగో పులి అంటే ఇదిగో తోక సామెతగా అష్టకష్టాలు పెడుతున్నది. ముందుకు రాదు. వెనక్కు పోదు; వచ్చి మైన పడిపోయినట్లు కన్పిస్తుంది - ప్రక్క గంటలో దూరంగా జరిగిపోయి ప్రాణ భయంతో గడగడ వణికే జనాన్ని చూసి వెక్కిరిస్తున్నది. ఎన్నో తుఫాన్లు చూశాం కాని దీని వలె జనంతో చెలగాటా లాడుతున్న ప్రకృతి విలయ క్రీడ ఎదురు కావడం ఇదే ప్రథమం.

నవంబరు 27తేది శ్రీలంక దగ్గర పుట్టిందొక అల్పపీడనం. మద్రాసుకు చేరువగా వచ్చే సరికది వాయుగుండంగా రూపాంతరం చెందింది. ఈలోగా అండమాన్‌లో ఉద్భవించిన మరొక అల్పపీడనం మెల్ల మెల్లగా జరుగుతూ వచ్చి దీనిలో కలిసిపోయింది. ఇంకే ముంది - సముద్రంలో ప్రళయమే పుట్టింది. రెండూ కలిసి రాక్షస అక్క చెల్లెళ్లలా చెట్టా పట్టాలేసుకొని సముద్రంలో వీర విహారం చేస్తున్నాయి. మద్రాసు నుంచి బర్మా వరకు ప్రళయ నృత్యం చేస్తున్నాయి. ముందు నెల్లూరు పేరు, తర్వాత మచిలీపట్నం పేరు చెప్పా; ఆ వెంటనే కాకినాడ కావచ్చునన్నారు; అబ్బెబ్బే - బంగ్లాదేశ్‌కు వెళ్లి పోయిందని ఊపిరి పీల్చుకున్నారు. కాని ఆ తుఫాను రక్కసి అటుపోయినట్లు పోయి, బర్మా వాకిలి తలుపు తట్టి, గోడకు కొట్టిన బంతిలాగా యమస్పీడుతో కాకినాడకు తిరిగి వచ్చేసింది. ఇది జరిగింది 3తేది. అప్పటి నుంచి దానికి క్రీడా వినోదం.

దాని స్పీడు, దాని పరిభ్రమణ నైజం, దాని పురోగమన లక్షణం ఏమైపోయాయో తెలియదు కాని ఎవరో కాళ్లు కట్టి పడేసినట్లు సముద్రం మధ్యలో కదలకుండా, నిలబడి పోయింది. మీదపుటేనుగు మత్తుగా వళ్లు విరుచు కొన్నట్లు, అప్పుడప్పుడు కొద్దిగా కదలడం ఆ తర్వాత మళ్లీ నిలబడి పోవడం - ఇదే ఆట. మధ్య మధ్యలో అలల మీద షికారుగా తేలే పడవ వలె మంద గమనంతో నాలుగడుగులు ముందుకు వేయడం - మళ్లీ వెనుకకు తిరిగి పోవడం. ఒక రోజంతా కాకినాడ దగ్గర జనాన్ని కకావికలం చేసింది; ప్రక్క రోజు మచిలీ పట్నంకు చుట్టపు చూపుగా వచ్చింది. రెండు రోజులు అక్కడ విలయ వినోదం. ఒక దశలో ఒడ్డున చూస్తే కన్పించేటంత దగ్గరగా జరిగింది. కేవలం 75 కిలోమీటర్ల దూరంలో 6గంటల పాటు శిలా సదృశంగా నిలబడి పోయింది.

ఇంకే ముంది - మచిలీ పట్నం జల సమాధి కావడం ఖాయమనే అనుకొన్నారు. దివి సీమ మరొకసారి దయ్యాల సీమ కాబోతుందని భయపడ్డారు. సముద్రపు అలలు ఉవ్వెత్తున లేచి పడ్డాయి. సాగర ఘోష ప్రళయ భీకరంగా విన్పించింది. చెలియలి కట్ట చిందర వందరైంది. నెత్తిన పిడుగు పడిపోయినట్లే భయపడి, జనమంతా కళ్లు మూసుకొని, ప్రాణాలు పిడికిట్లో పెట్టుకొని క్షణాలు లెక్క పెట్టుకొంటూ గడుపు తుండినారు - వున్నట్టుండి భళ్లున ఎండకాసింది. కారణమేమిటయ్యా అంటే - హఠాత్తుగా తుఫాన్ తన దిశ మార్చుకొని, జరజరమని ప్రాకుకొంటూ నెల్లూరుకు తరలి పోయిందని చెప్పారు.

చావనివ్వ కుండా, బ్రతక నివ్వకుండా గిల్లి, గిచ్చి, ఉడికించి ఏడ్పించి చంపుతున్న ఈ తుఫాన్ తీరు తెన్నులు తెలుసుకోవడం కొమ్ములు తిరిగిన శాస్త్రవేత్తలకే అంతు బట్టడం లేదు. వారి రాడార్లు, కంప్యూటర్లు, ఎలక్ట్రానిక్ పరికరాలు తుఫాన్ ఎక్కడుందో చెప్పగల్గు తున్నాయి కాని, ఎటు వెళ్తుందో, ఎప్పుడు వెళ్తుందో చెప్పడం వారి కలివి కావడం లేదు.

ప్రభుత్వానికి మాత్రం ఈ చెలగాటం ప్రాణ సంకటంగా పరిణ మించింది. కృష్ణ, గుంటూరు, తూర్పు గోదావరి జిల్లాల నుంచి 5లక్ష మందిని తీరగ్రామాల నుంచి బలవంతంగా లారీల కెక్కించి సమీప పట్టణాలకు తరలించారు. 700 సహాయక శిబిరాలు ప్రారంభించారు. వీరందరికీ అన్నపానీయాలు అందించారు. లారీలతో నీళ్లు, మందులు రెడీ చేశారు. సైన్యాన్ని పిలిచారు. నావికా దళానికి అభ్యర్థన పంపారు. హెలికాప్టర్లు కావాలని అడిగారు. దివి సీమలోని కోడూరు, నాగాయ లంక, అవనిగడ్డ మండలాలలో వూళ్లకు వూళ్లు ఖాళీ చేయించారు. ఏదో యుద్ధం జరుగు తున్నట్లే వుండిందా వాతావరణం. ప్రభుత్వ ఖజానాకు పెద్ద చిల్లి పడింది. తీరా చూస్తే - ఆ తుఫాన్ కాస్తా అందర్నీ వెక్కిరించి నెల్లూరు దగ్గరకు వచ్చేసింది.

తుఫాన్ల ప్రళయం, విలయం మనం చాలాసార్లు చూశాం కాని. ఇట్లా ఆడుకోవడం మాత్రం ఎప్పుడూ జరగలేదు. ఉత్తరం నుంచి వీచే చల్లటి గాలుల వల్ల సముద్రంలో తుఫాన్ అస్తవ్యస్తంగా నడుస్తున్నదని శాస్త్రవేత్తల అంచనా. తుఫాన్ ఏర్పడి, ఒక క్రమ పద్ధతిలో తీరం దాటాలంటే సముద్రపు నీటి ఉష్ణోగ్రత 27డిగ్రీలు వుండాలట. కాని చలిగాలుల పుణ్యాన నీళ్లు చల్లబడి పోవడంతో పాపం ఆ ప్రకృతి రక్కసికి కాళ్లు చేతులు ఒక చోట కుదురుగా నిలవడం లేదట.

అసలే చంద్రబాబు సర్కారు బికారి వేషంలో వుంది; ఈ తుఫాన్ క్రీడతో ఆ చింపిరి గుడ్డలు కూడా వూడిపోతాయేమోననే భీతితో బిత్తర చూపులు చూస్తుండినారు. మచిలీ పట్నం దగ్గర అది తీరం తాకి వుంటే పెను ఉప్పెన తాకిడి తగిలి వుండేది. ఆ విలయం వూహించ లేము. ప్రకృతికి మాత్రం హృదయంలోనూ ఎక్కడో అడుగున పిసరంత జాలి గుణం మిగిలి వుండిందేమో - అందర్నీ కరుణించింది.

## చెన్నారెడ్డి స్మృతి చాలా కాలం నిలుస్తుంది!

ఆంధ్ర ప్రదేశ్ మాజీ ముఖ్య మంత్రి, తమిళనాడు గవర్నరు డాక్టర్ మర్రి చెన్నారెడ్డి 2 తేది ఉదయం మరణించారు. మనుమడి పెళ్లికని హైదరాబాదుకు వచ్చి వుండినా రాయన; ఇక్కడే ప్రాణంపోయింది. 4 తేది మధ్యాహ్నం అత్యంత గౌరవ ప్రదంగా, సర్వ లాంఛనాలతో ఆయనకు అంతిమ సంస్కారం జరిగింది.

చెన్నారెడ్డి గారిది విశిష్ట, విలక్షణ రాజకీయ జీవితం. యాభై ఏళ్ల సుదీర్ఘ ప్రజా జీవనంలో ఆయన ఆశించి – అందుకోలేని ఉన్నత శిఖరాలు లేవు. ఎమ్మెల్యేగా, ఎమ్పీగా, రాష్ట్ర మంత్రిగా, కేంద్ర మంత్రిగా, ముఖ్య మంత్రిగా, గవర్నర్‌గా విభిన్న పదవు లలంకరించారు. ఏ పదవిలో వున్నా ఆ పదవికి వన్నె తేవడం ఆయన విశిష్టత. అద్భుతమైన వాక్చాతుర్యం, అమోఘమైన వాగ్ధాటి, ఎంతటి వాడినైనా కంటిచూపుతో నియంత్రించే గాంభీర్యత ఆయన లక్షణాలు. అధికారులను పరుగులు పెట్టించే నేర్పరితనం వుంది; ప్రజల



నాడి పట్టి చూచే నైపుణ్యం వుంది. చట్టాలు, నిబంధనలు ఆయనకు కంఠోపాఠం. ఏ సబ్జక్టుకు సంబంధించిన ఫైలు విషయంలోనూ ఆయన్ను తప్పుదారి పట్టించడం అధికారుల కలివయ్యేది కాదు. ఇంగ్లీషు, హిందీ, ఉర్దు, తెలుగు భాషలు నాలుగూ అనర్గళంగా మాట్లాడే వారు. చల్లటి నవ్వుతో పలుకరించడం, కళ్లతో చంద్ర నిప్పులు కురిపిస్తూ విరుచుక పడడం సమంగా చేతనయ్యేవి. అందువల్లే ఆయన సమక్షంలో ఎంతటివారూ పిల్లి వలె ప్రవర్తించే వాళ్లు.

రాజకీయంగా ఆయన్ను చూస్తే ఢిల్లీలో వుండే పెద్దలకు ఎప్పుడూ భయమే. ఒక్క నెల కూడా ఆయన ఖాళీగా వుండే పరిస్థితి కల్పించేవారు కాదు. ఎక్కడో ఒక చోట గవర్నర్ పదవి వెతికి ఇచ్చేవారు. ఆయన గవర్నర్‌గా వస్తున్నా డంటే ఆ రాష్ట్రాలలోని ముఖ్య మంత్రులకు హడల్. చట్టం పరిధి నతిక్రమించ కుండా వారిని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీరు త్రాగించడం ఆయనకు సరదా! జయలలిత వంటి గండాగొండి మనిషే చెన్నారెడ్డి దెబ్బకు దారెత్తి పోయింది.

కొరవ 7 పేజీలో

# నెల్లూరుకే దాపురించింది ఉపద్రవం!

ఉరుమురిమి మంగళం మీద పడినట్లు తుఫాన్ ఉపద్రవం అటు తిరిగి, ఇటు తిరిగి నెల్లూరు మీద పడబోతూంది. తీరం మీద పాదం మోపడానికి బర్మా నుంచి మద్రాసు దాకా ఎక్కడా చోటు దొరకనట్లు నెల్లూరును వెతుక్కొంటూ వచ్చిపడిందా మురనష్టపు తుఫాన్. 5 తేది మధ్యాహ్నమే నెల్లూరు తీరం చేరిందని; ముందు కావలి దగ్గర కొద్దిసేపు తచ్చటాయిస్తూ నిలబడింది. తర్వాత శ్రీహరికోట దగ్గరకు వెళ్లింది. ఈ వార్త వ్రాసే సమయానికి (6 తేది ఉదయం) అక్కడే నిలబడి వుంది. తీరానికి 80 కిలోమీటర్ల దూరంలో వున్నదట. ఏ క్షణంలోనైనా సూళ్లూరు పేట – మద్రాసుల మధ్య ఆ తుఫాన్ రక్కసి నేలపై కాలు పెడుతుందని అంచనా.

అయితే దానిలో మూడు రోజుల నాటి ఉధృతి లేదు. కొద్దిగా బలహీన పడింది. అట్లని ప్రమాదం లేదని కాదు; గాలి వేగం రెండు రోజుల క్రితం వలె రెండు వందల కిలోమీటర్లు కాక, నూట పాతిక కిలోమీటర్ల స్పీడుతో వుంటుం దంటున్నారు. పెను ఉప్పెన భయం లేదు కాని, రెండు మీటర్ల అదనపు ఎత్తున అలలు లేస్తాయని అంచనా. చెలియలి కట్ట బలహీనంగా వుండే చోట సముద్రపు నీరు ముందుకు తోసుకొని వచ్చేస్తుం దంటున్నారు. ఇప్పటి అంచనా ప్రకారం ఏమి జరిగినా – మద్రాసు – సూళ్లూరు పేటల మధ్యనే. ఈ రోజు (6 తేది) వేకువ నుంచి నెల్లూరు జిల్లా అంతా ముసురు పట్టి వుంది. చినుకు చినుకుగా పడుతూంది వర్షం. చలి మాత్రం చంపేస్తున్నది. సూళ్లూరుపేటలో మంచి వాన; 9 సెంటీ మీటర్లు కురిసిందట.

అధికారులు కళ్లలో వత్తులు వేసుకొని కాపలా కాస్తున్నారు. కలెక్టరాది ఉన్నతాధి కారులకు కూడా రెండు రాత్రుల నుంచి నిద్ర లేదు. దాదాపు 50 వేల మందిని తీర గ్రామాల నుంచి తరలించారు. ఆహార పొట్లాల పంపిణీ వంటివి జరుగు తున్నాయి. నేషనల్ హైవే పైన ట్రాఫిక్ నియంత్రి స్తున్నారు. మద్రాసులోనే లారీలు నిల్చిపోవడం మేలని డ్రైవర్లకు సలహా ఇస్తున్నారట.

ఇప్పుడింకో తుఫాన్ వస్తే తట్టుకొనేటట్లు లేదు నెల్లూరు జిల్లా ఇప్పటికే రెండు వరదలు, ఒక తుఫాన్ చవి చూసేశాం ఈ రెండు నెలల్లో. చెరువులన్నీ నిండుగా వున్నాయి. రెండు పదున్ల వాన పడినా పొర్లి పోయేట్లున్నాయి. మళ్లీ పంట నష్టమంటే కోలుకొనే గుండె నిబ్బరం రైతులలో లేదు. రోజ్ల పరిస్థితి చూస్తే ఏడుపు వస్తూంది. ఇంతగా నలిపి పారేసిన తర్వాత కూడా ప్రకృతికి నెల్లూరు పై కోపం తగ్గలేదంటే – అది మన ప్రారబ్ధమనుకో వలసిందే.

# దేవగౌడ పలికేది బొంకు - పెట్రోలు ధర పెంపు ఖాయం!

పెట్రోలు ధరలు పెంచేది లేదని దేవగౌడ, చిదంబరంలు కలిసి పలుకు తున్నవి పలుకే పలుకులే. అవి వారి పెదవులపై నుంచి వస్తున్న బొంకులే తప్ప, వాస్తవ పరిస్థితిని వ్యక్తం చేసే నిజాలు కావు.

మొన్నటి మార్చి బడ్జెట్‌లో చిదంబరం పెట్రోలియం ఉత్పత్తుల కోసం 7.6 బిలియన్ డాలర్లు (రూ.27 వేల కోట్లు) కేటాయించారు. కాని పెట్రోలు వినియోగం పెరిగిపోయి, అంతర్జాతీయ మార్కెట్‌లో ధరలు హెచ్చడం వల్ల ఇప్పటికే ఈ అంచనా 9.6 బిలియన్ డాలర్లకు (రూ.35 వేల కోట్లు) పెరిగింది. అంటే ఐదు నెలల్లో 8 వేల కోట్ల లోటు ఏర్పడిం దన్నమాట.

ఒక్క వంట గ్యాస్ విషయమే చూసినా - డిసెంబర్ 1 తేదీ నుండి గ్యాస్ టన్ను ధర 250 డాలర్ల నుంచి 300 డాలర్లకు పెరిగింది. దీని ఫలితంగా ఒక్కొక్క సిలిండర్‌పై ప్రభుత్వానికి రూ.25ల ఖర్చు పెరుగుతుంది. ఈ అదనపు భారం భరించే స్థితిలో ప్రభుత్వం లేదు. దేవగౌడ ఎన్ని

## షేర్‌కాలం

డాక్టర్ ఎ. దుర్గాప్రసాద్

మాటలు చెప్పి మాయ చేయజూచినా పెట్రోలు ధరలు పెంచక తప్పదు.

### ఎయిరిండియాకు నష్టం 400 కోట్లు

ఎయిర్ ఇండియా, ఇండియన్ ఎయిర్ లైన్సులు కలిసి రూ.400 కోట్ల నష్టం చూపించాయి. కడుపు మండించే విషయ మిది. ఇండియన్ ఎయిర్ లైన్స్ ఇటీవల పలుసార్లు టిక్కెట్ల ధరలు పెంచింది. అయినా ఇంత నష్టమంటే పబ్లిక్ రంగ సంస్థలు ఎంత సుందర ముదనష్టంగా నడుస్తున్నాయో అర్థం చేసుకోవచ్చు.

### దిగుమతులు తగ్గి దేశానికి సుంకం నష్టం

ఎగుమతులు పెరిగి దిగుమతులు తగ్గడం ఆర్థిక మంత్రులకు ఆనందం కల్గించే విషయం. కాని భారత దేశంలో మాత్రం పరిస్థితి అందుకు భిన్నంగా వుంది. ఈ ఏడాది దిగుమతులు భారీగా తగ్గాయి. పారిశ్రామి కాభివృద్ధి కుంటు పడడమే దీనికి కారణం. అందువల్ల విదేశీ మారక ద్రవ్య వినియోగం తగ్గినా - దిగుమతులపై వచ్చే కస్టమ్స్ సుంకం తగ్గిపోయి చిదంబరం సమస్యలో పడిపోయారు. అసలే లోటు బడ్జెట్ - దానికి ఈ అదనపు లోటు అయ్యో పాపం!

పురవీధుల పహరాలో పురపాలక నేత ఆనం వివేకానంద రెడ్డి; కమీషనర్ రాముసుబ్బా రెడ్డి; కౌన్సిలర్లు చాట్ల నరసింహారావు, పిండి సురేషన్, భానుశ్రీ.

### పంపానది జలాలు పాప పంకిలాలు!

శబరిమలై వద్ద గల పంపానది జలాలు సూక్ష్మక్రిములకు నిలయాలుగా మారాయి. కేరళ హైకోర్టు ఆదేశాల మేరకు ఈ నదీ జలాలను పరీక్షించిన కాలుష్య నియంత్రణ బోర్డు ఈ విషయాన్ని నిర్ధారించింది. ఏడు స్నానఘట్టాలలో శాంపిల్స్ సేకరించారు. 100మిల్లీ లీటర్ల నీటిలో 720 సూక్ష్మ క్రిములున్నట్లు కనుగొన్నారు. వీటి సంఖ్య ఇంకా పెరగ వచ్చునంటున్నారు. ఇవి అనారోగ్యాన్ని కలిగించే ప్రమాదకరమైన సూక్ష్మజీవులని శాస్త్రజ్ఞులు తేల్చారు. ఐతేనేం? శాస్త్రం దారి శాస్త్రానిది. నమ్మకం దారి నమ్మకానిదే! స్వామియే శరణమయ్యప్ప!

### స్నేహ బంధము, ఎంత మధురమూ!

విదేశీ మారక ద్రవ్య దుర్వినియోగ నేరం క్రింద మద్రాసు సెంట్రల్ జైల్లో జుడిషియల్ కస్టడీలో వున్న శశికళ హఠాత్తుగా అనారోగ్యం పాలైంది. ఆమెపై ఒక సరికొత్త కేసును నమోదు చేయడానికి ఎన్‌ఫోర్స్‌మెంట్ అధికారులు వెళ్లినప్పుడు ఈ సంఘటన జరిగింది. మూర్ఛవ్యాధితో చేతులు వంకర్లు పోయిన శశికళను మద్రాసు జనరల్ హాస్పిటల్ ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో చేర్చి ప్రత్యేక చికిత్సలు చేయవలసి వచ్చింది. ఆమెను పరామర్శించడానికి వచ్చిన తొలి వ్యక్తి ఎవరనుకొన్నారు? మద్రాసు మాజీ ముఖ్యమంత్రిణి, ఆమె ప్రాణసఖి కుమారి జయలలిత! శశికళతో తెగతెంపులు చేసుకొన్నారు గదా. ఎందుకు వచ్చారు అని జర్నలిస్టులు అడిగితే జయలలిత బాధపడింది! 'పన్నెండేళ్ల అనుబంధం మాది! ఒక్క మాటతో తెగిపోతుందా?' అన్నదామె! శశికళ కింకా బెయిల్ మంజూరు కానందున ఇప్పట్లో విడుదల అయ్యే అవకాశాలు లేవట!

## నేటిభారతం

తిరుమూరు సుధాకర రెడ్డి

### రామర్ పిళ్ళయ్ పెట్రోల్ 'ఇల్లయ్!'

మూలికా పెట్రోల్ పేరుతో ఇంత వరకు నడిచిన ప్రహసనానికి ఒక తెరపడినట్లే! శాస్త్రీయంగా మూలికా పెట్రోల్‌ను తయారు చేయడంలో రామర్‌పిళ్ళయ్ మరోమారు విఫలమైనాడు. ప్రధాని దేవగౌడ చొరవతో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పెట్రోలియం, డెహరాడూన్ వారు రామర్ పెట్రోలు ప్రయోగాన్ని ఏర్పాటు చేశారు. సైన్స్ అండ్ టెక్నాలజీకి సంబంధించిన పార్లమెంటు కమిటీ సభ్యుల సమక్షంలో జరిగిన ప్రదర్శనలో రామర్ పెట్రోల్ మంత్రం పారలేదు! ఒక్క చుక్క పెట్రోల్ కూడా రాలేదు!! ఇప్పటికే ప్రముఖ శాస్త్రజ్ఞు లంతా రామర్ ప్రయోగాన్ని 'మేజిక్'గా కొట్టిపారేశారు. అయినా దేశవ్యాప్తంగా రామర్‌కి వచ్చిన పాపులారిటీ గమనించి కేంద్ర ప్రభుత్వం మరో అవకాశం ఇచ్చింది. ఇందులోనూ మన పెట్రోల్ బాయ్ తోక ముడిచేశాడు.

### చిల్లర కావాలా? ఆర్నెల్లు ఆగండి!

చిల్లర దొరకడం లేదనే గోల పచారీ కొట్ల నుంచి పార్లమెంటు వరకూ వెళ్లింది! పాపం! దేశ ఆర్థిక మంత్రి శ్రీ చిదంబరం గారే దీనిపైన సంజాయిషీ యివ్వవలసి వచ్చింది. రెండు, ఐదు రూపాయల నోట్ల ముద్రణ ఆపివేసి వాటిని నాణాలుగా మార్చడమే చిల్లర కొరతకు కారణమని సెలవిచ్చా రాయన. కలకత్తా, హైదరాబాదు, ముంబాయి లలోని ప్రభుత్వ టంకశాలల ఆధునికీకరణ 1997 జూన్ నాటికి పూర్తవు తుందని ఆ తర్వాత చిల్లర కోసం అల్లరి చేయవలసిన పనే వుండదని సంబరంగా చెప్తున్నారు చిదంబరం!

### నేతాజీ శతజయంతి

నేతాజీ సుభాష్ చంద్రబోస్ శతజయంతి ఉత్సవాలు 1997 జనవరి 23తేదిన ఢిల్లీలోని ఎర్రకోటలో ప్రారంభం కానున్నాయి. ఏడాది పాటు జరిగే ఈ ఉత్సవాల నిర్వహణకు ప్రధాని దేవగౌడ అధ్యక్షతన ఒక కమిటీ ఏర్పాటైంది!

### వివాదాస్పద సినిమా

పంజాబ్ తీవ్రవాదం ఇతివృత్తంగా గుల్జార్ తీసిన 'మాచిస్' అనే హిందీ సినిమా దేశమంతటా వివాదాలు రేపుతోంది. తీవ్రవాదాన్ని గ్లామరైజ్ చేసి పోలీస్ వ్యవస్థ పరువు తీసిందని ఈ సినిమాపై రాజ్యసభలో రభస జరిగింది. దీన్ని నిషేధించాలని సభ్యులు డిమాండ్ చేశారు. పంజాబ్ ప్రశాంతంగా వున్న సమయంలో ఈ సినిమా ఎందుకొచ్చినట్లు? మానిన గాయం రేపడానికా?

# ఏమి చేసినా చిదంబరమే చేయాలి!

## భారతీయ షేర్‌మార్కెట్ పరువు ప్రపంచ మంతటా దిగజారి పోయింది!

ప్రపంచంలో అత్యంత బలహీనమైన, దుర్బలమైన షేర్ మార్కెట్‌లలో ఒకటిగా భారతీయ షేర్ మార్కెట్ చులకన ప్రాయమౌతూ వుంది. విదేశాలలో మన మార్కెట్ పట్ల కనీసపాటి విశ్వాసం కూడా లేకుండా పోయింది. యునైటెడ్ ఫ్రంట్ నేతగా దేవగౌడ ప్రమాణ స్వీకారం చేసిన తర్వాత, ఈ ఆరు నెలలలో బిఎస్‌ఇ ఇండెక్స్ 1000 పాయింట్లు పతనం కావడం ఆందోళన కల్గించే విషయం. దీనితో షేర్ల ధరలు తగ్గి ప్రజలు, సంస్థలు రెండు లక్షల కోట్లు నష్టపోయారు. హర్షద్ మెహతా స్కాం సమయంలో పలికే ఇప్పుడూ మార్కెట్ క్యాపిటలైజేషన్ విలువ దినదినానికీ తరుగుతూ వున్నది.

పెద్ద పెద్ద కంపెనీలు తమ ప్యాక్టరీలను, వ్యాపారాలను సమర్థవంతంగా నడిపి, అత్యధిక లాభాలు ప్రకటిస్తున్నా మార్కెట్‌లో వాటి పట్ల కూడా సరైన ప్రతిస్పందన లేకపోవడం విచిత్రం. స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా విషయమే చూడండి; ఈ ఏడాది వారు 640 కోట్ల లాభం చూపించారు. గతంలో వారికి వచ్చిన లాభం 250 కోట్లు మాత్రమే. అంటే ఇంచు మించు మూడు రెట్లు లాభం పెరిగిం దన్నమాట. కాని ఆ షేర్ ధర రూ.220ల నుంచి రూ.210లకు తగ్గింది. విచిత్రమైన విషయమిది. రిలయన్స్, ఐటిసి కంపెనీలకూ ఇదే గతి పట్టింది.

షేర్ మార్కెట్‌లోని ఈ దుస్థితికి బాధ్యత పూర్తిగా కేంద్ర ప్రభుత్వానిదే! మార్కెట్‌ను ప్రోత్సహించే చర్యలేవీ వారు చేపట్టడం లేదు. ప్రభుత్వ అసమర్థత, అలక్ష్యం, రాజకీయ అనిశ్చిత స్థితుల వల్ల విదేశీ పెట్టుబడులు దేశంలోకి రావడం లేదు. విదేశీయులు మన ఆర్థిక వ్యవస్థ పనితీరు పట్ల తీవ్రమైన అవిశ్వాసం వ్యక్తం చేస్తున్నారు.

దేశంలోని చిన్న ఇన్వెస్టర్లకూ మార్కెట్‌పై నమ్మకం పోయింది. వారు రోజు రోజుకూ దూరంగా తొలగి పోతున్నారు. ప్రజలలో షేర్ వ్యాపార మంటే చులకన ఏర్పడడం గమనించ వచ్చు. పేకాటలో డబ్బు దండగ చేసుకొనే వాళ్ని చూసినంత తేలికగా, హేళనగా చూస్తున్నారు షేర్లు కొని, అమ్మేవారిని! ఇది ఒక బాధంగా పరిగణన అవుతోంది. ఈ పరిస్థితిని మార్చ వలసిన బాధ్యత, అవకాశం చిదంబరంకు మాత్రమే వున్నాయి.

దేశంలోని ఇన్వెస్ట్‌మెంట్ సంస్థలైన యుటిఐ, ఎల్ఐసి, జనరల్ ఇన్స్యూరెన్స్ వంటి కంపెనీల వద్ద ఇంచుమించు 6 వేల కోట్ల రూపాయల నగదు నిల్వలు వున్నాయి. ఈ డబ్బును షేర్ మార్కెట్‌కు తరలించి రిలయన్స్, టాటా, ఎసిసి, ఎంటిఎన్ఎల్ వంటి బ్లూచిప్ షేర్లను; సిమెంటు, స్టీలు, బ్యాంకింగ్, ఆటోమొబైల్ రంగాలకు చెందిన బి గ్రూప్ షేర్లను కొనిపించి, కనీసం ఏడాది పాటు వాటిని అమ్మకుండా ఆంక్ష విధిస్తే తక్షణం పరిస్థితిలో మార్పు వస్తుంది. ఇప్పటికే ఈ సంస్థల దగ్గర వున్న షేర్లను అధమ పక్షం ఆరు నెలల పాటు అమ్మకుండా ఆంక్ష విధించాలి. మార్కెట్‌లో షేర్ల లభ్యతను తగ్గించ గల్గితే రేట్లు వాటంతట అవిగా పెరుగుతాయి.

ఇదే రకమైన ఆంక్షలు విదేశీ సంస్థల పైన సైతం విధించాలి. వార్తు మన షేర్లతో జూద మాడుతున్నారు. తమ దగ్గరున్న షేర్లను కొద్ది కొద్దిగా అమ్మడం; ఆ తర్వాత ఒకసారిగా షేర్లు పెద్ద మొత్తంలో డంప్ చేసి, రేట్లు పడగొట్టడం. ప్రక్కరోజు మళ్లీ అవే షేర్లను పడిపోయిన రేట్లలో కొని ఐదారు రూపాయల ఆదాయం సంపాదించడం వారి వ్యాపారమై పోయింది. విదేశీ సంస్థలు ఒక వారం పాటు తాము అమ్మిన షేర్లను తిరిగి కొనకూడదని నిబంధన పెడితే వీరి జూదం తగ్గుతుంది.

స్వదేశీ బ్యాంకులు షేర్ల విషయంలో నిర్లిప్తంగా వుంటున్నాయి.

కొరవ 7 పేజీలో

# పివి పదవీ వ్యామోహం

కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకత్వాన్ని అంటి పెట్టుకొని వుండడానికి మాజీ ప్రధాని శ్రీ పివి నరసింహారావు పడుతున్న తాపత్రయం ప్రతి కాంగ్రెస్ వాదీ సిగ్గుతో తలదించు కోవలసిన పరిస్థితి కల్పిస్తున్నది. రాజకీయ పరమావధి కేవలం పదవి మాత్రమే నన్న నీచత్వానికి నిదర్శనంగా వ్యవహరిస్తున్నారు నరసింహారావు గారు!

లాల్‌బహదూర్ శాస్త్రి వంటి మహోన్నత వ్యక్తిత్వం కల్గిన నాయకుల తరం సంగతి మర్చిపోయి, సతీష్‌శర్మ, సుఖరాం వంటి నేలబారు రాజకీయవాదుల కోణం నుంచే చూసినా - పార్టీలోనే కాదు - అసలు ప్రజా జీవితంలో వుండడానికే అనర్హుడు పివి. తన అవినీతి, అసమర్థత, ఆశ్రిత పక్షపాతం, అధికార దుర్వినియోగాల ద్వారా భారతీయ ప్రధాన మంత్రి కుర్చీకే అప్రతిష్ఠ తెచ్చిన మరుగుజ్జు నాయకుడాయన. దేశంలో రాజకీయ వ్యవస్థ పట్ల అవిశ్వాసం, రాజకీయ వాదుల పట్ల అసహ్యం పెచ్చు పెరిగి పోవడానికి కారకుడు ఆయనే! ప్రధానిగా గడిపిన ఐదేళ్లలో ఆయన చరిత్రను త్రవ్వి చూస్తే - స్మశానం గోతుల్లో నుంచి పుర్రెలు, ఎముకలు బయట పడినట్లు పాప కార్యాలు అసంఖ్యాకంగా బయట పడుతున్నాయి. ఆయన కొడుకులు, కూతుళ్లు, అల్లుళ్లు, మేనల్లుళ్లు ప్రజాధనాన్ని పటిక బెల్లం వలె నంజుక తిన్నారు. ఆయన మంత్రులలో సగం మంది అవినీతి సామ్రాట్టులుగా గణుతికెక్కి చెరశాలల్లో, కోర్టు బోనుల్లో తారట్లాడు తున్నారు. ఏ దుర్మార్గపు దోపిడీ ఫైలు చూసినా పివి వంశపు కంపే! పెట్రోలు బంకుల నుంచి యూరియా స్వాహా వరకు పివి బంధుత్వ మమకార నీచత్వమే! ఈ ఐదేళ్ల కాలంలో కొన్నివేల కోట్ల రూపాయల ప్రజా ధనాన్ని రాజకీయ వాదులు బొక్కేశారు. అవినీతిని బహిరంగంగా సమర్థించిన ఇందిరా గాంధీ హయాంలోనూ ఇంత దారుణాలు జరగలేదు.

వీటన్నింటినీ మించి తానే స్వయంగా పలు నేరారోపణలు ఎదుర్కొంటున్నారు పివి. అందులో ఒకటి మోసం కేసు, ఒకటి లంచాల కేసు, ఒకటి ఫోర్జరీ కేసు. రాజకీయాలలోనే కాదు - సమాజంలో అతి సామాన్యంగా బ్రతికే ఒక సగటు మనిషిపై ఇటువంటి కేసులు కోర్టుల్లో దాఖలైతే వాడ్ని పురుగును చూసినట్లు చూస్తాం మనం! అటువంటిది - ఏమీ జరగనట్లు, తన తప్పేమీ లేనట్లు పది మందిలో తలెత్తుక తిరగడానికి పివికి ఎట్లా మనసు ఒప్పుతున్నదో అనూహ్యం.

ఒక నాయకునిపై సాధారణ విచారణ జరిగే సమయంలోనూ పదవులు పరిత్యజించి, నిర్దోషిత్వం రుజువు పరచు కోవడం సర్వ సాధారణ విషయం. నీలం సంజీవరెడ్డి నుంచి జనార్దనరెడ్డి వరకు ఆంధ్రలో ముఖ్యమంత్రులు, మంత్రులు, తమపై కోర్టుల్లో చిన్న వ్యాఖ్య విన్పడగానే పదవులు వదిలి పెట్టేశారు. విచారణా సంఘాల పరిధిలో తమ ప్రస్తావన వచ్చినందుకే నిన్నగాక మొన్న చిదంబరం వంటి వారూ మంత్రి పదవులు వీడారు. జైన్ హవాలా కేసులో నిందితులనే సాకుతో పివియే పలువురు కేంద్ర మంత్రులను ఇళ్లకు పంపించడమే కాక మాధవరావు సింధియా వంటి సత్యశీలునికి ఎన్నికలలో పోటీ చేయను పార్టీ టికెట్ ఇవ్వలేదు.

నీతి పాఠాలు, ధర్మ సూత్రాలు అంత గొప్పగా వల్లెవేసిన పివి ఇప్పుడు తనదాకా వచ్చే సరికి పార్టీ [illegible] చూరు పట్టుకొని వ్రేలాడడం ఆశ్చర్యకరంగా కాదు - అసహ్యంగా వుంది. కోర్టుల్లో రోజూ చీవాట్లు తింటూ కూడా, బోనెక్కి నిలబడుతూ కూడా ఆయనింకా పార్టీ పెద్దగా చలామణీ కావాలను కోవడం కంటె రోతపని మరొకటి లేదు.

ఆయన పుణ్యాన దేశంలో కాంగ్రెస్ పార్టీకి పుట్టగతులు లేకుండా పోయాయి. ఖద్దరు టోపీ కనిపిస్తే ప్రజలు అవహేళనచేసే పరిస్థితి కల్పించారు. ఇంకేమి మిగిలి వుందని, ఇంకే శ్రార్ధ కర్మలు జరిపించాల్సి వుందని ఆయన కాంగ్రెస్ పార్లమెంటరీ నాయకత్వాన్ని కాపలించుకొని వున్నారో అర్థం కావడం లేదు. దిగజారుడుకు చివరి అంచు కూడా దాటి, అడుగుకు పడిపోయింది; ఆయన వ్యక్తిత్వం ఇంకా పదవీ వ్యామోహం ప్రదర్శిస్తే ఆయన పేరునే ద్వేషిస్తారు జనం. ఈ దశలోనైనా పివికి జ్ఞానోదయం కలిగి, వివేకం జనించి తనంతట తానుగా పదవులన్నిటినీ వదిలేసి ఇంటిదారి పడితే [illegible] కనీసం పార్టీ అయినా బాగు పడుతుంది.

జమీన్‌రైతు

సీతారాం కేసరి పలుమార్లు ఈ అభిప్రాయమే వ్యక్తం చేశారు. కాంగ్రెస్ అధ్యక్షుడి పదవుప యోగించి పివిని సాగనంపడానికి కేసరికి క్షణం పట్టదు; కాని, పెద్దవాడనే గౌరవంతో తట పటాయిస్తున్నట్లున్నాడు. ఆ గౌరవం కాపాడు కోవడం పివి కనీస ధర్మం. సిపిపి నుంచి తక్షణం వైదొలగడం ఆయన చేయ వలసిన కడగొట్టు పని!

---

## జమీన్‌రైతు

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

6.12.46

పేజీలు:8 వెల: 0-1-6

### ధాన్యం హెచ్చినా ధరలు తగ్గవు

1947లో ఆహార ధాన్యాల ధరలు పెంచరాదని భారత ప్రభుత్వం వారు చేసిన సిఫార్సును మద్రాసు ప్రభుత్వం వారు ఆమోదించారు. ఈ సాలు పంట మొత్తం మీద బాగనే పండుతుందని, కాబట్టి గత సాలులో రైతుల కిచ్చిన బోనసు ఈ సాలులో ఇవ్వవలసిన అగత్యం లేదని గూడా ప్రభుత్వం వారు నిశ్చయించారు.

విదేశాల నుంచి దిగుమతులు అనుకొన్న ప్రకారం త్వరలో వస్తే, ధాన్యం ధరలు మందగించవచ్చు. కాని ప్రస్తుత ధరలు తగ్గకుండా నిలపడానికి సైతం ప్రభుత్వం వారు నిశ్చయించారు.

### 6384కత్తులు పట్టుకొన్నారు

నెల్లూరు చాకలివీధిలో షేక్ మహబూబ్ సాహెబు ఇంట్లో 7జాజి చెక్క పెట్టెలలో అమర్చి యుండిన కత్తులు 3తేది రాత్రి సబ్ డివిజనల్ మేజస్ట్రేటు, డిప్టీ సూపరెంటు, సబ్ మేజస్ట్రేటు, సర్కిల్ ఇన్‌స్పెక్టర్లు పోయి పట్టుకొన్నారు. లెక్కబెట్టగా బత్తాయి కత్తులు 5324, జాక్ కత్తులు 1060 ఉన్నవి. వీటిని సీలువేసి సబ్ మేజస్ట్రేటు కచ్చేరిలో ఉంచి ఉన్నారు. పై వాటిలో జాక్ కత్తులు అపాయకరమైన వట. బత్తాయి కత్తులు గూడా కొంత సంస్కరిస్తే అవీ అపాయకరమే. ఇవిగాక వెయ్యి కత్తుల దాకా అతను అమ్మినాడట కాని ఎవరికి అమ్మినది చెప్పడు. ముస్లింలకే అమ్మినట్లు దృఢపడినదని వార్త. యీ పెట్టెలున్న యింట్లో ఎవరూ కాపురం లేరు.

చాకలి వీధిలో యస్.యం. ఖాదర్ బాషా (యు.బి.యస్.లో కమ్మరి పనిచేసే వాని) యింటి ముందు బావిలో కత్తులున్నవనే సందేహంతో 6తేది మధ్యాహ్నం పోలీసు సర్కిల్ వగైరా వచ్చి సోదా చేస్తున్నారు. ఒక ఈటెను బయటకు తీసినారు. ఇంకా ఉన్నట్లు తెలుస్తున్నది. తీయుటకు కష్టంగా ఉన్నదని బావిలో నీరు ఫైర్ సర్వీసు సహాయంతో తోడుతున్నారు.

### జాషువా కవికి సన్మానము

మధుర కవి శ్రీ జి. జాషువా గారికి నూతన సంవత్సరారంభమున తే 1.1.47ది కవి గజ గండ పెండేర ప్రదాన గజారోహణాది మహోత్సవము బెజవాడలో జరుగును. కావున ఈ మహోత్సవమునకు కళాభిమానులెల్లరు దయచేసి సభను మహోజ్వలముగా చేయ ప్రార్థించుచున్నామని ఆహ్వాన సంఘం వారు వ్రాస్తున్నారు.

కొరవ 12-పేజిలో

---

## జనవాణి

# ఉత్తుత్తి మాటలు వద్దు - ఉద్యోగావకాశాలు కల్పించండి!

నానాటికీ పెరిగి పోతున్న నిరుద్యోగులకు చిరుద్యోగావకాశాలు కల్పించలేని తెలుగు దేశం ప్రభుత్వం "సి.యం.అండ్ వై" పథకం ద్వారా యువతను మభ్యపెట్ట జూస్తున్నది. అధికారం చేజిక్కించు కొన్న తర్వాత ప్రభుత్వో ద్యోగాలలో నియామకాలు నిలిపి వేసి నిరుద్యోగ యువతను బజారు పాలు చేసింది

నేడు అమలులో వున్న సి.యం.వై. నెహ్రూ రోజ్‌గార్ యోజన పథకాలు రాజకీయ పలుకుబడి గలవాళ్లకు, బ్యాంకులకు పూచీకత్తు పెట్టగల ఆర్థిక స్తోమత గల వారికి మాత్రమే పరిమితమవు తున్నాయి.

తెలుగు దేశం ప్రభుత్వం ఉద్యోగాల కల్పనకు కృషి ప్రారంభించాలి. వొట్టిమాటలు కట్టిపెట్టి గట్టి మేలు చేసి చూపెట్టాలి.

నెల్లూరు దాసరి రాజశేఖర్

### మంగళ ఎక్స్‌ప్రెస్ శాశ్వతంగా నిలుపుకోవాలి!

నెల్లూరు జిల్లా రైల్వే యూజర్స్ అసోసియేషన్ నిరంతర కృషి వల్ల మన ఎంపి శ్రీమతి పనబాక లక్ష్మిగారి పట్టుదల వల్ల మంగళ ఎక్స్‌ప్రెస్ నెల్లూరులో ఆగుతూంది. అయితే ఒక్క చిక్కు ఉంది. మంగళ ఎక్స్‌ప్రెస్‌కు నెల్లూరులో టిక్కెట్ల వల్ల వచ్చే ఆదాయాన్ని బట్టి దాని నిలుపుదల శాశ్వతం అవుతుంది. లేకుంటె "ఉత్తుత్తి పెళ్లికి ఊరంతా సందడి" అన్న చందంగా ఆరునెల్లకే మళ్లీ ఇక్కడ ఆగకుండా దౌడు అందుకొంటుంది. కాబట్టి నెల్లూరు ప్రయాణీకులు తమ ప్రయాణాలను మంగళ ద్వారా చేస్తే మంచిది. మంగళ మంగుళూరు నుండి నెల్లూరుకి ఉదయం 7-47కి; నిజాముద్దీన్ (ఢిల్లీ) నుండి సాయంత్రం 5-33కు వచ్చి రెండు నిమిషాల్పేపు ఆగుతుంది.

నెల్లూరు నుండి ఉత్తరంగా విజయవాడ బలార్షా, నాగపూర్, భోపాల్, ఝాన్సీ, గ్వాలియర్, ఆగ్రా, మధుర, నిజాముద్దీన్ (ఢిల్లీ) వరకు పోతుంది. దక్షిణంగా గూడూరు, రేణిగుంట, కోలారోపేట, కోయంబత్తూరు, ఎరనూరు, మంగుళూరు వరకు పోతుంది. వచ్చేటప్పుడు పొయ్యేటప్పుడు పైన పేర్కొన్న స్టేషన్లలోనే ఆగుతుంది. కాబట్టి కృష్ణా ఎక్స్‌ప్రెస్, జి.టి. ఎక్స్‌ప్రెస్‌లలో బయలు దేరే వారు మంగళ ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం చెయ్యాలి. బెంగుళూరు వెళ్లే వాళ్లు రేణిగుంట వరకు మంగళలో వెళ్లి అక్కడ నుండి ఆ సమయంలో వచ్చే మైసూర్ ఎక్స్‌ప్రెస్‌లో బెంగుళూరు వెళ్లవచ్చు. కాబట్టి నెల్లూరు ప్రజలు మంగళ ఎక్స్‌ప్రెస్‌కు ప్రాధాన్యత నిచ్చి మంగళ ప్రదమైన కలెక్షన్లకు తోడ్పడాలి.

నెల్లూరు ఇ. వెంకటేశ్వరరావు

### వివేకా సార్థక నామధేయుడు

మునిసిపల్ ఛైర్మన్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి పెద్దనాన్న స్వర్గీయ ఎ.సి. సుబ్బారెడ్డి గారి అడుగు జాడలలో నడుస్తున్నాడు; అందరికీ అందుబాటులో ఉంటున్నారు. నెల్లూరు టౌన్ అభివృద్ధి కోసం పార్టీల కతీతంగా స్థానిక మంత్రివర్యులతో కలసి మెలసి ఎన్నో పనులకు శ్రీకారం చుడుతున్నారు. అయితే పనులు చేయించే సందర్భాలలో నీతి నియమాలకు ఆస్కారం ఇవ్వాలి.

నెల్లూరు వాస్తురామచంద్ర

### ముఖ్యమంత్రి ప్రయత్నశీలి- గట్టిమనిషి

ఒకనాడు దివిసీమ, మొన్న రాయలసీమ, నిన్న కోనసీమ ప్రాంతాలు ప్రకృతి విలయానికి విలవిల లాడాయి. ఎందరో ప్రాణాలు పోగొట్టు కున్నారు.

కొరవ 8 పేజిలో



నెల్లూరులో జరిగిన యూరాలజీ డాక్టర్ల సదస్సు – నెల్లూరు డాక్టర్లు జెట్టి శేషారెడ్డి, మోహనరాజు ; కలెక్టర్ డాక్టర్ సాంబశివ రావు, మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి సదస్సుకొచ్చిన సర్జన్లు, డాక్టర్లు

## నెల్లూరు సంగతులు

# రోడ్డుపనుల్లో లోపం వుంటే దారినపోయే వారైనా ఎత్తి చూపండి!

ఫత్తేఖాన్ పేటలోని మెయిన్ వీధిలో సుమారు 400మీటర్ల పొడవు 5 1/2మీటర్ల వెడల్పు, 4అంగుళాల మందంగా ఉండేటట్లు నిర్మిస్తున్న సిమెంటు రోడ్డును మున్సిపల్ ఛైర్మన్ ఆనం వివేకానంద రెడ్డి పర్యవేక్షించారు. పనులు జరుగు తున్నప్పుడు వాటి నాణ్యతను తనిఖీ చేసే హక్కు ప్రజలకు కూడా ఉంది. ఎవరైనా సరే తనిఖీ చేసి లోపాలు ఉన్నట్లయితే తన దృష్టికి తీసుకొని రావచ్చు నన్నారాయన. విలేఖరుల సమావేశంలో కౌన్సిలర్ పిండి సురేష్, చాట్ల నరసింహారావు, శ్రీమతి భానుశ్రీ, పసుపులేటి శ్రీనివాసులు, కమీషనర్ రామసుబ్బారెడ్డి, పబ్లిక్ హెల్తు డి.ఇ.ఇ. ఆదిశేషయ్య, కిలారి వెంకటస్వామి నాయుడు తదితరులు పాల్గొన్నారు.

### రాష్ట్రాభివృద్ధి చెన్నా భిక్షే

"ప్రస్తుత రాష్ట్రాభివృద్ధి

> పటణ పౌరులకు పురపాలక నేత స్వేచ్ఛ ప్రసాదించాడు!

చెన్నారెడ్డి పెట్టిన భిక్షే; రాష్ట్రానికి ఆయన చేసిన మేలు మరపు రానిది" అని జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డి ఇందిరాభవన్‌లో జరిగిన సంతాప సభలో అన్నారు. నెల్లూరు మున్సిపల్ ఛైర్మన్ ఆనం వివేకానందరెడ్డి ప్రసంగిస్తూ– "తెలంగాణా ప్రజా సమితి పేరుతో చెన్నారెడ్డి నిర్వహించిన ఉద్యమం అనితర సాధ్యం; రాజకీయాలకు అతీతంగా సేవ చేసి దేశ చరిత్రలో ఆయన తన పేరును సుస్థిరం చేసుకొన్నారు" అన

సంతాప సభలో మాజీ ఎమ్మెల్యే శ్రీ శేషారెడ్డి, కోటం రెడ్డి శ్రీనివాసులు రెడ్డి, జిల్లా యువజన కాంగ్రెసు అధ్యక్షుడు ప్రవీణ్‌కుమార్ రెడ్డి, ఐ.ఎన్.టి.యు.సి. రాధయ్య, మహిళా కాంగ్రెస్ పందిళ్లపల్లి

కొరవ 11 పేజీలో

# మబ్బు క్రమ్మిన శుక్రతార ఎన్ఎస్‌కె!

"శ్రీ ఎన్నెస్కె మృతితో నెల్లూరులో ఒక సుప్రసిద్ధ వ్యక్తి శాశ్వతంగా కనుమరుగై పోయ్యారు. ఆయన మబ్బు కమ్మిన శుక్రతార; నివురు గప్పిన నిప్పు. మన ప్రాచీన గ్రంథాలనెన్నింటినో అవలోకన చేసి అనేక సత్యాలను వెల్లడించారు. అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన శ్రీ ఆనంద కుమార స్వామి వంటి మహనీయులతో

> సంతాపసభలో బెగోర నివాళి

ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన మహా మేధావి. ఆయన వర్ధమాన సమాజానికి చేసిన సేవలు ఎనలేనివి; పేరు ప్రఖ్యాతు లార్జించుకొన్న సాహిత్య వేత్త లందరూ ఆయన ఇంట అతిథి సత్కారాలు పొందిన వారే" అని 1 తేది వర్ధమాన సమాజం ఆధ్వర్యంలో జరిగిన ఎన్నెస్కె సంతాప సభలో సభాధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి శ్రీ ఎన్నెస్కె దీక్షిని కొనియాడారు.

కళా ప్రపూర్ణ శ్రీ మరుపూరు కోదండ రామిరెడ్డి – ఎన్నెస్కె సాహిత్య, చారిత్రక, పురాతత్వ నాట్యాది శాస్త్రాలలో ఆయనకు గల ప్రజ్ఞా ప్రాభవాలను ప్రశంసించారు.

శ్రీ యుతులు పి.వి. రమణారెడ్డి, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, మద్దాలి మల్లికార్జున రావు, కె.పి. నారాయణరావు, వేదం వెంకటరామన్, డి.వి. రమణయ్య, బి. వెంకటేశ్వర రావు, వి. అనంత రామయ్య, మోపూరు వేణు గోపాలయ్య, మోనా, యస్. సుందరబాబు, ఎ. రాజసింహ ప్రభృతులు తమ అనుభవాలను వెల్లడించి శ్రద్ధాంజలి ఘటించారు.

ఎన్ఎస్‌కె స్మృత్యంకంగా ఏటా ఆయన జయంతి రోజైన శ్రీరామ నవమి నాడుగాని, లేదా ఆయన వర్ధంతి నాడైనా కార్తీక పున్నమినాడుగాని, సాహిత్య చారిత్రక విషయాలలో అభినివేశమున్న వారిని సత్కరించాలనీ, ఆయన చిత్ర పటాన్ని వర్ధమాన సమాజ గ్రంథాలయంలో ఆవిష్కరించాలని తీర్మానించారు.

డాక్టర్ గోపాలరెడ్డి గారు వెంటనే వెయ్యి రూపాయలు విరాళం

కొరవ 8 పేజీలో

# సణుగుడు

* మోహన్‌బాబుకు లేకుంటే, ఎమ్మెల్లకైనా బుద్ధుండక్కర్లేదా?
* మునిసిపల్ ప్రభువులూ – సూరత్ వెళ్లి చూచిరండి!

ఎదుటి మనిషికి చెప్పేటందుకే నీతులు వున్నాయని ఒక సినిమా కవి ఎప్పుడో చెప్పారు. సినిమాలలో నీతి పాఠాలు తెగ బోధించే నటుడు మోహన్ బాబు ఈ సూత్రాన్ని బాగా వంట బట్టించు కున్నట్లున్నారు.

తిరుపతిలో ఆయనకొక స్కూలు వుంది. చాలా ఖరీదైన బడి. ఒక్కొక్క స్టూడెంట్ దగ్గర ఏడాదికి రూ.30 వేలు వసూలు చేస్తున్నారు. సినిమాలలో కంటే స్కూలులో వచ్చే ఆదాయమే ఎక్కువగా వుండి వుండా లాయనకు. పైగా అది ఒటడోర్ స్టూడియో కం స్కూలు. షూటింగ్‌ల పేరిట నెలకొక సారైనా పిల్లల చదువు చెడగొడ్తుంటారు. రెండందాలా, రెండు చేతులా ఈ బడి ద్వారా డబ్బు పిండు కోవడంలో ఆయన వ్యాపార దక్షత అమోఘం.

దీనికి తోడు ఇప్పుడు కొత్తగా బడిపేరుతో ప్రజల సొత్తు అరగింపుకూ అలవాటు పడిపోయారు మోహన్ బాబు. పార్లమెంట్ సభ్యులకు తమతమ నియోజక వర్గాలలో తమకు నచ్చిన ప్రజాసేవా కార్యక్రమాలు చేయడానికి కేంద్ర ప్రభుత్వం ఏడాదికి కోటి రూపాయల గ్రాంటు ఇస్తుంది. ప్రజల కుపయోగపడే పనులకు దాన్ని మాత్రమే వాడాలని రూలు. మోహన్‌బాబూ పార్లమెంట్ సభ్యుడే! ఆయన భక్తికి మెచ్చి ఎన్టీఆర్ దేముడు రాజ్యసభ వరం ప్రసాదించారు; అది చేతికి రాగానే అదే ఎన్టీఆర్‌కు పంగనామం పెట్టేశారు – అది వేరే సంగతి. ఈ నిధులలో నుంచి తన స్కూలుకు డబ్బు రాబట్టు

> డోలేంద్ర

కొంటున్నా డాయన.

మరీ తన స్కూలుకు తన పేరుతోనే చెక్కు వ్రాస్తే బాగుండదని – తిరుపతి లోకసభ సభ్యుల ప్రాణం తోడి, వారి నిధుల్లో నుంచి పిక్కు తింటున్నారు. మాజీ ఎమ్పీ డాక్టర్ చింతా మోహన్‌ను మొగమాట పెట్టి 10 లక్షలు కాజేశాడట. తన స్కూలు ప్రజల కోసం వుద్దేశించిందని, దానికి కంప్యూటర్‌లు కొని ప్రజలకు చెందిన పిల్లలకు సేవ చేయనున్నామని చెప్పి, చెక్కు వ్రాయించు కొన్నాడట. ఇప్పటి ఎమ్పీ శ్రీ సుబ్రహ్మణ్యంను కూడా ఇదే నయగారంతో వెంటబట్టాడు కాని, ఆయన దగ్గర ఆ పప్పులు ఉడికినట్లు లేవు.

ఎంత దగా? ఎంత మోసం? ఏడాదికి రూ.30 వేలు ఫీజు దండే స్కూలు – ప్రజల సంస్థ? సంపన్న కుటుంబీకులు చదువు కొనుక్కునే బడి – ప్రజలకు చెందిన దౌతుందా? ఫీజుల రూపంలో సంవత్సరానికి 3 కోట్లు ఆర్జించే స్కూలు యజమాని ప్రజాసేవకుడా? అడగడానికి ఆయనకు బుద్ధి లేకుండా పోతే పోయింది – ఇవ్వడానికి ఎమ్పీలకు సిగ్గెట్లా లేకుండా పోయింది చెప్పండి?

ఈ దోపిడీ ఒక్క తిరుపతి ఎమ్పీల నుంచే జరిగిందా లేక రాష్ట్రంలోని ఇతర ఎమ్పీల నుంచీ

కొరవ 7 పేజీలో


ఒంగోలు ఎమ్పీ మాగుంట పార్వతమ్మ ప్రెస్ కాన్ఫరెన్స్ – ప్రక్కన పివి ప్రసన్నరెడ్డి.

# మాగుంట సుబ్బరామరెడ్డి అడుగులలోనే నా నడకలు!

సేవాతత్పరతలో నా భర్తే నాకు స్ఫూర్తి; ఆయన ఆశయ సిద్ధి కోసం ఆయన అడుగు జాడల్లోనే నడవాలను కొంటున్నాను; నడుస్తున్నాను కూడా" 4వ తేది నెల్లూరు లోని తమ స్వగృహంలో ఏర్పాటు చేసిన పాత్రికేయుల సమావేశంలో ఒంగోలు పార్లమెంటు సభ్యురాలు మాగుంట పార్వతమ్మ పై మాటలు అన్నారు. తాను చేపట్టనున్న సేవా కార్యక్రమాలకు పాత్రికేయుల తోడ్పాటు నాకు అవసరం. మారిచ్చే సూచనలు సలహాలలో ఆచరణ యోగ్యమైన వాటిని స్వీకరిస్తానని అన్నారామె.

ఒంగోలులో నేనెక్కడికి వెళ్లినా

> పార్వతమ్మ ప్రతిన

"మంచినీళ్లు మంచినీళ్లు" అని ప్రజలు కలవరిస్తున్నారు. ప్రభుత్వం కొంత కృషి చేస్తున్నది; అయినా అది వాళ్ల దాహార్తిని తీర్చలేదు. అందువల్ల ఒంగోలు పార్లమెంటు నియోజక వర్గంలో ఒక మంచినీటి పథకాన్ని ప్రారంభిస్తున్నాను. 10లక్షల రూపాయలు ఒంగోలు కలెక్టరు గారికిచ్చి మంచినీళ్ల బోరింగులు వేయించ మంటున్నాను. ఫిబ్రవరి నెల 19తేది స్వర్గీయ సుబ్బరామ రెడ్డితో నా వివాహ వార్షికోత్సవం. ఆరోజే మంచినీటి పథకం మొదలవుతుంది అన్నారామె.

"ప్రభుత్వం చేతిలోకి వెళ్ళిన సొమ్ము పదిలంగా ప్రజలను చేరదు. దారిలోనే తూట్లుపడి చాలా భాగం దారి

కొరవ 8 పేజీలో

# స్మగ్లర్ల కోసం అధికారి బదలీ - తెలుగుదేశం నేతల రాజనీతి ఇదీ!

ఎర్రచందనం స్మగ్లర్లకు సింహ స్వప్నమైన జిల్లా అటవీ శాఖాధికారి శ్రీ ప్రదీప్ కుమార్ని బదిలీ చేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. అటవీ శాఖ సిబ్బందితో కుమ్మక్కయిన ఎర్ర చందనం స్మగ్లర్లకు ఇక అడ్డు అపు వుండదు. ప్రదీప్ కుమార్ రాపూరు, దాచూరు అటవీ రేంజిల్లో చందనం స్మగ్లింగ్ కాకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసిన నిజాయితీ గల అధికారి. స్మగ్లర్లతో చేతులు కలిపి వాళ్ల మోచేతి క్రింద నీళ్లు తాగుతున్న ఒక రేంజర్‌ను, ఇద్దరు గార్డుల్ని సస్పెండు చేయించారు కూడా. ఇటువంటి నిజాయితీ గల అధికారిపై పడిన బదిలీ వేటులో జిల్లా మంత్రి హస్తముందని ప్రజలు అనుకొంటున్నారు.

## రాపూరుకు గ్యాస్ డీలర్లు కావాలి

"తెలుగు గంగ" పుణ్యాన వెనుక బడిన తనాన్ని వెనక్కి నెట్టేసి ముందుకు సాగుతున్న రాపూరులో నేటికీ వంట గ్యాస్ సౌకర్యం లేకపోవడం శోచనీయం. కొన్నాళ్లు 'పాల్‌గ్యాస్' ప్రైవేట్ కంపెనీ గ్యాస్ సప్లయి చేస్తూ టక్కున ఆపేసింది. ఆ కంపెనీ దివాలా తీసిందని స్థానిక డీలరు అంటున్నారు. ప్రైవేటు కంపెనీలను నమ్ముకోవడం వెర్రితనమే.

ఒక డిగ్రీ కాలేజీ, జూనియర్ కాలేజీ, ఇంకా ప్రభుత్వ కార్యాలయాలు,

**రాపూరు ప్రజలు నోట్లో వూస్తున్నారు!**

రెండు కమర్షియల్ బ్యాంకులు రాపూరులో ఉన్నాయి. ఎంతగానో వ్యాపార వాణిజ్యాలు విస్తరిస్తున్నాయి అయినా వంట గ్యాసు వసతిలేదు.

నాయుడుపేట, సూళ్లూరుపేటల్లో కాల్ గ్యాస్, హెచ్.పి గ్యాస్ డీలర్లు ఉన్నారు. రాపూరుకు ఈ కనీస సౌకర్యం లేకపోవడం ఆశ్చర్యకరం అని వ్రాస్తున్నారు. శ్రీ కాకుటూరి సుబ్రహ్మణ్యం. ఎమ్మెల్యే, ఎమ్పీలు ఈ విషయం ఎందుకు పట్టించుకోరన్నది ఆయన ప్రశ్న. కందకులేని దురద కత్తిపీటకెందుకు? ప్రజల్లో ఆ చైతన్యం లేనప్పుడు ప్రజా ప్రతినిధులకు ఏది మాత్రం పట్టుంది చెప్పండి!

## రబీ పంటగా పొద్దుతిరుగుడు

అక్టోబర్ నెలలో భారీ వర్షాలకు చెరువులు గండ్లుపడి పొలాల పైబడి అపారంగా పంట నష్టం జరిగింది. రిజర్వాయర్లలో నీళ్లు సమృద్ధిగా ఉన్నందు వల్ల రబీ పంట కాలంలో వరి, వేరు శనగతో పాటు 95 రోజులలో పంట చేతికి వచ్చే పొద్దు తిరుగుడు సాగు చేస్తే రైతులు ఎంతగానో లాభ పడతారు. దీనికి అవసరమైన సాంకేతిక సమాచారం-

విత్తుకాలం: నీటి సౌకర్య మున్నప్పుడు శీతా కాలంలో నవంబరు, డిసెంబరు మాసాల్లో విత్త కోవచ్చు.

కొరవ 12 పేజీలో

'పామాయిల్ ఫ్యాక్టరీ ఆవరణంలో – మాజీ ఎమ్మెల్యే, ఫ్యాక్టరీ భాగస్వామి జెకె రెడ్డి.

# పామాయిల్ తోటలతో మెట్టరైతులకు నికరమైన లాభాల హామీ ఇస్తున్నారు!

జెకె రెడ్డి, జెఎస్ రెడ్డి సోదర ద్వయం, తమ ఉభయ మిత్రుడు సామంతు గోపాల రెడ్డితో కలిసి నిర్మించిన పామాయిల్ ఫ్యాక్టరీ ప్రారంభమైంది. 2 తేది రైతుల సమక్షంలో కలెక్టర్ డాక్టర్ డి. సాంబశివ రావు మెషిన్లకు స్విచాన్ చేశారు; ఎస్పి శ్రీ పూర్ణచంద్ర రావు, రాపూరు ఎమ్మెల్యే శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి, ఎస్ అండ్ ఎస్ కంపెనీ జిఎం శ్రీ రామచెల్లప్ప, ఉద్యానవన శాఖ జాయింట్ డైరక్టర్ శ్రీ నారాయణ రావు, డాక్టర్ రత్నం, వెరకు ఫ్యాక్టరీ మాజీ ఛైర్మన్ శ్రీ సామంతు సుబ్బారెడ్డి తదితరు లంతా ప్రారంభోత్సవ సభలో పాల్గొన్నారు. మాజీ ఎమ్మెల్యే, ఫ్యాక్టరీ భాగస్వామి శ్రీ జెకె రెడ్డి రైతులకు ఫ్యాక్టరీని, నర్సరీని చూపించారు.

మనుబోలు దగ్గర, రోడ్డు ప్రక్కనే నిర్మితమైన ఈ "సింహపురి అగ్రో ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్" పామాయిల్ పరిశ్రమ జిల్లాలో మెట్ట రైతాంగానికి వరప్రసాదం వంటి సంస్థ. గంటకు రెండు టన్నుల పామొలిన్ కాయలను క్రష్ చేసి, నూనె తీసే సామర్థ్యం వుంది దీనికి. కనీసం 1200 ఎకరాల పామొలిన్ తోట అవసరం ఈ ఫ్యాక్టరీ నడప డానికి! 3 వేల ఎకరాల తోటకు ఈ ఒక్క ఫ్యాక్టరీ చాలు.

భాగస్వామ్య త్రయం – చాలా సాహసించి ఈ పరిశ్రమ స్థాపించిందనే చెప్పాలి! పామొలిన్ తోటల పెంపకం జిల్లా రైతాంగానికి పరిచయం లేని వ్యవసాయం. దానిపై రైతులలో చాలా సందేహా లున్నాయి. అయినా వీరు జంక లేదు. పామొలిన్‌ను మొదటగా నెల్లూరుకు తెచ్చింది వీరే! సర్వేపల్లి దగ్గర స్వయంగా 200 ఎకరాల సాగు

కొరవ 12 పేజీలో

# ఖాళీ స్థలాలమ్మి కావలి మునిసిపల్ ఖజానా నింపుతారట!

డబ్బులేదనే సాకుతో కావలి మునిసిపాలిటీ మున్సిపల్ స్థలాలను తెగనమ్మాలని గత వారం జరిగిన ఒక సమావేశంలో తీర్మానించింది. పట్టణ మధ్యలో ఉన్న చేపల, మాంసం మార్కెట్ల వల్ల దుర్గంధం పెచ్చరిల్లి పోతూంది. మార్కెట్టు పట్టణం మధ్య నుంచి తొలగించి ఆ స్థలాన్ని వేలం వేస్తే 50లక్షల రూపాయలు వస్తాయని వైస్ ఛైర్మన్ శ్రీ గ్రంధి యానాదిశెట్టి చేసిన ప్రతిపాదనను కౌన్సిల్ ఆమోదించింది.

ఖాళీ స్థలాల అమ్మకాల వల్ల ఆదాయం తక్కువ కాబట్టి జాతీయ రహదారిపై ఉన్న కాంప్లెక్సుల్లో షాపులను వేలం వేస్తే కోటి రూపాయలు వస్తాయని కాంగ్రెస్ కౌన్సిలర్ సయ్యద్ బాల్వి చేసిన ప్రతిపాదన కూడా ఏకగ్రీవంగా ఆమోదమైంది.

పట్టణంలో కంపోస్టు యార్డు లేనందు వల్ల మునిసిపల్ పారిశుధ్య సిబ్బంది చెత్తనంతా రోడ్డు కిరువైపులా పోస్తున్నారు. కనీసం చెత్త కుండీలనైనా ఏర్పాటు చేయలేదు. అంటూ తోట శ్రీహరి ధ్వజమెత్తారు.

కంపోస్టు యార్డు స్థల సేకరణ విషయం అధికారులు పట్టించు కోవడం లేదు. జనం చచ్చిన జంతు కళేబరాలను కూడా రోడ్డు ప్రక్కల పారేస్తున్నారు. థియేటర్లలో శానిటేషన్ పరమ అధ్వాన్నంగా ఉంది. అధికారులు శానిటేషన్ సర్టిఫికెట్లు ధారాళంగా ఇచ్చేస్తున్నారు అంటూ వైస్ ఛైర్మన్ గ్రంధి యానాదిశెట్టి విమర్శించారు.

కావలి ఆర్.డి.ఓ. సూచన మేరకు బుడమ గుంట రోడ్డులో గల 13 ఎకరాల స్థలాన్ని మున్సిపాలిటిలో కలపాలని తీర్మానించారు. దీన్నెప్పుడు అమ్మకానికి పెడతారో?

## బాలాయపల్లిలో బలాత్కారం కేసు

బాలాయపల్లి మండలం గాజులపల్లిలో కూని మధు అనే యువకుడు ఒక పధ్నాలుగేళ్ల బాలికను మానభంగం చేశాడట. బాలాయపలి

పేరున్న సర్జను డాక్టర్ మోహనరామ రెడ్డి కుమార్తె డాక్టర్ కమల; బెంగుళూరు ఎంపి రమణా రెడ్డి కుమారుడు శ్రీనివాస రెడ్డి; వీరి వివాహం 5 తేది నెల్లూరులో జరిగింది.

పోలీసు స్టేషనులో దీనిపై ఫిర్యాదు నమోదైంది. అత్యాచారానికి పొడిగట్టిన కూని మధు తన మేనమామ కూతురుతో వివాహానికి తొందర పడుతున్నాడనీ, కలెక్టరు గారు చొరవ తీసుకొని విచారణ పూర్తయ్యే వరకు ఈ పెండ్లి ఆపుచెయ్యాలని బాధితురాలు తండ్రి ప్రాధేయ పడుతున్నారు.

## వేటపాళెంలో పురుషులకు టైలరింగ్ శిక్షణా కేంద్రం

ప్రకాశం జిల్లా వేటపాళెంలో స్థానిక మండల కాంప్లెక్సులో ఉన్న గ్రామీణాభి వృద్ధి కేంద్రం డిసెంబరు రెండవ వారంలో పురుషుల్లకు టైలరింగులో 15 రోజుల పాటు శిక్షణ కార్యక్రమం ఏర్పాటు చేస్తున్నది. 18 నుండి 35సం. లోపల ఉండే పురుషులు 7వ తరగతి పాసై ఉంటే దరఖాస్తులు పంపుకోవచ్చు. శిక్షణా కాలంలో ఉచిత భోజన వసతి సదుపాయా లుంటాయి. పూర్తి బయోడేటాతో దరఖాస్తులు రూడ్‌సెటి, మండల పరిషత్తు కాంప్లెక్స్, వేటపాళెం - 523 187 ప్రకాశం జిల్లా అనే చిరునామాకు పంపాలి. కలర్ టి.వి.

మెకానిజంలో కూడా డిసెంబరు 3వ వారంలో 15 రోజుల పాటు శిక్షణ ఇస్తారు. వయస్సు, విద్యార్హతలు పై విధంగానే ఉండాలి. వీళ్లు డిసెంబర్ 10లోగా దరఖాస్తులు పంపుకోవాలి.

# ఆత్మకూరు డాక్టర్‌కు మందులంగళ్ల బెదిరింపు!

తన ముత్తాత సంపాయించి పెట్టిన పట్టా అనుకున్నాడేమో, ప్రభుత్వ ఆసుపత్రిలో షటిల్ కోర్టు వేయించాడు. ఒక మందుల షాపు యజమాని. డాక్టరు దాన్ని తొలగించ మన్నాడు. అతడు విన్పించు కోకుండా కొన్నాళ్ళు సాచేటు చేశాడు. కాని డాక్టర్ పట్టు వదల్లేదు. విధిలేక షటిల్ కోర్టు తీసేశాడు.

అప్పుడాయన తన మందుల షాపులో ఉండే మందులే పేషెంట్లకు వ్రాయాలని డాక్టరును ఒత్తిడి చేస్తున్నాడట. చిత్త శుద్ధిగల డాక్టరు "ఛీపో" అనడంతో, ఆ డాక్టర్‌ను బదలీ చెయిస్తానని బెదరిస్తున్నాడట. ఎమ్మెల్యే గారికి అతి సన్నిహితంగా మెలగ గల్గడం ఆ అంగడి ఓనరు దబాయింపుకు కారణం. ఎమ్మెల్యే గారూ – ఇటువంటి ప్రబుద్ధులనా మీరు దగ్గరకి తీయాల్సింది.

## రాపూరులో మద్యం జోరు

కడప జిల్లా కోడూరు, రాజంపేట మండలాల నుండి మద్యం రాపూరు, వెంకటగిరిలలో ఏరులై పారుతూంది. ఎక్సైజ్ పోలీసులు తాగి వీధుల్లో తందనాలాడే వాళ్లను అరెస్టు చేస్తున్నారేకాని విక్రయదార్ల జోలికి వెళ్లడం లేదు. రాపూరుకు రెండు కిలోమీటర్ల దూరంలో చెక్‌పోస్టు ఏర్పాటు చేస్తే మద్యాన్ని కొంత మేరకు అదుపు చేయవచ్చు.

**ఎమ్మెల్యే గారూ, మీ అనుచరులట - నిజమేనా?**

## మహమ్మదాపురం స్కూలు విరాళం

కోనసీమ వరద బాధితుల సహాయర్థం మహమ్మదా పురం జి.ప. ఉన్నత పాఠశాల ఉపాధ్యాయులు, విద్యార్థులు రూ.4116/-లు సేకరించి డిడి తీసి జిల్లా కలెక్టరు గారికి పంపారు.

# నెల్లూరు నలుచెరగుల్లా
## విమర్శకుడు

### తుఫాన్ నిధికి జికాం వసూలు రు.50వేలు

జిల్లా కాంగ్రెస్ తరఫున తుఫాన్ నిధి క్రింద రు.50వేలు దండారు. జికాం అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి స్వయంగా జోలె పట్టి స్టోన్‌హౌస్ పేట వంటి చోట్ల తిరిగారు. చిల్లర రాలిందంతే. ప్రక్క రోజు మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానందరెడ్డి ట్రంకురోడ్డు, మండపాలవీధుల్లో చిక్కాటన చేశారు. పెద్దగా ఫలితం కన్పించలేదు. మరీ పరువు పోయేట్లుందని కాంగ్రెస్ వారులే తలా కొంత వేసి రు.50వేలు జమ చేశారు. ఇందిరా భవన్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో ఆ నిధిని మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డికి అప్పచెప్పి - పిసిసికి పంపించారు.

### జెకె విరాళం లక్ష

మాజీ ఎమ్మెల్యే శ్రీ జెకె రెడ్డి తుఫాన్ నిధి కోసం లక్ష రూపాయల విరాళం ఇచ్చారు. 1తేది హైదరాబాదులో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడును కలిసి చెక్కు ఇచ్చి వచ్చా రాయన.

రు.75వేలు ఇవ్వాలని ముందు అనుకున్నారు; అదే ప్రకటించారు కూడా! కాని అక్కడ దాకా వెళ్లేసరికి దాతృత్వం పొంగి పొర్లి వెల్లు వెత్తినట్లుంది; మరొక పాతిక వేలు కలిపి, రౌండ్ ఫిగర్ చేసి ఇచ్చేసి వచ్చారు.

జిల్లాలో సంపన్నులు చాలా మందే వున్నారు; కాని వారిలో ఎవరూ ఇంత ఉదారంగా వ్యవహరించ లేదు. జెకె రెడ్డి ఒక్కడే అంతటి మంచి మనసు చేసుకున్నాడు; ఆయన్ను మనసారా అభినందిద్దాం!

### జెఎస్ కూడా లక్ష ఇచ్చాడు!

అన్నను అనుసరించే తమ్ముడు - జెఎస్ రెడ్డి హైదరాబాదులో లక్ష ఇచ్చి వచ్చి రాగానే; అక్కడ ఆయన సోదరుడు శ్రీ జెకె రెడ్డి తన వంతు విరాళంగా మరొక లక్ష ఇచ్చాడు. మనుబోలు దగ్గర వారి పామోలిన్ ఫ్యాక్టరీ ప్రారంభోత్సవ సభలో కలెక్టర్ సాంబశివరావు గారి చేతికి చెక్కు ఇచ్చేశారాయన.

జెకె రెడ్డికైనా నెల్లూరు టౌన్‌తో అనుబంధం, రాజకీయ సంబంధాలు వున్నాయి. జెఎస్‌కు కనీసం పబ్లిసిటీ అవసరం కూడా లేదు. కేవలం మానవత్వ భావమే ఈ వదాన్యతకు పురికొల్పి నట్లుం దాయన్ను. ప్రశంసనీయం ఈ ఉదారత్వం.

### కిరోసిన్ స్వాహా - స్టాకిస్ట్ వివరణ!

తుఫాన్ కోసం వచ్చిన కిరోసిన్‌ను అట్టట్లే స్వాహా చేసేశారని గత వారం వ్రాసిన వార్తపై నవాబు పేట స్టాకిస్ట్ శ్రీ దయాకర రెడ్డి వివరణ ఇచ్చారు. కిరోసిన్ పంపిణీకి సంబంధించి తానొక్కడ్నే స్టాకిస్ట్ కాదని, జిల్లాలో తన వంటివారు 21 మంది వున్నారని; తనకు వచ్చిన కిరోసిన్ నంతటినీ డీలర్లకు ఇచ్చేశానని; అందుకు తగిన రసీదులూ తన వద్ద వున్నాయని చెప్తున్నాడా స్టాకిస్ట్.

డీలర్ల సహకారం లేనిదే, అధికారులు సమ్మతి తెల్పనిదే కిరోసినే కాదు - మరే వస్తువూ ఆరగించడం ఎవరికీ అలివి కాదు. ఇటువంటి స్వాహాలు వెలికి వచ్చినప్పుడు అందరిపైనా సమగ్ర దర్యాప్తు జరిపితే తప్ప నిజాలు బయట పడవు. నెల్లూరు స్టాకిస్ట్ ఆరగింపు వార్తలో అతిశయోక్తులు దొర్లి వుండవచ్చు కాని, అట్లని అసలు స్వాహాయే జరగ లేదనుకోవడం పొరపాటు. జిల్లాలో తతిమా స్టాకిస్టులనూ ఒకసారి పట్టి చూడడం అవసరం.

అయితే ఈ వార్తలు, ఆందోళనల ఆధారంగా దొంగలను పట్టుకోవడం మాని, దొంగసొత్తును పిండు కోవడంలో విజిలెన్స్ సిబ్బంది బిజీ అయిపోతున్నారని అలజడిగా వుంది. ఈ ఆరోపణలను చూపించి డీలర్లను బ్లాక్‌మెయిల్ చేస్తున్నారట. టౌన్‌లోని డీలర్లు రూ.15 వేలు, పల్లెల్లోని వారు రూ.10 వేలు లెక్కన ఇవ్వాలని దబాయి స్తున్నారట. ఇవ్వకుంటే కేసులు పెడతామని బెదరిస్తున్నారట. పెట్రోలు బంకుల నుంచీ నెల మామూళ్లు దండు తున్నట్లున్నారు. జిల్లాలో విజిలెన్స్ సిబ్బంది నెల కలెక్షన్ ఐదు లక్షలకు పైనే వుందని అంచనా. పై నుంచి క్రింద దాకా పంచు కొంటున్నారీ పిండారీ సొత్తును.

### పెళ్లకూరు కళ్యాణ మండపంపై దౌర్జన్యం

పప్పుల వీధిలోని పెళ్లకూరు అనసూయమ్మ కళ్యాణ మండపాన్ని ఆక్రమంగా, దౌర్జన్యంగా స్వాధీనం చేసుకోవ డానికి డాక్టర్ మధుసూదన శాస్త్రి ప్రయత్నించారట. ఈ స్థలం కుర్తాళం ఆశ్రమానిది; భవనం కట్టించింది స్వర్గీయ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారు. రామచంద్రా రెడ్డి గారిపై వుండే గౌరవ ప్రపత్తుల వల్ల దాన్ని ఆయనకు అప్ప చెప్పారు అప్పటి స్వామీజీ. ఆయనా గతించారిప్పుడు. ఇప్పటి స్వామీజీ వ్యసన లోలుడట. అందువల్ల ఆ ఆశ్రమాని కుండే ప్రాధాన్యం, ప్రాశస్త్యం రెండూ పోయాయి.

డాక్టర్ మధుసూదన శాస్త్రి గారు మరికొందరు కలిసి కొత్త స్వామీజీని లోబరచుకొని, ఏమగ్గొ్యంచి పూరేగించి, వుద్బించి ఈ మండపం ఆక్రమించు కోవాలని చూశారు. అది అలివి కాకపోయే సరికి కొందరు కిరాయి రౌడీలతో దౌర్జన్యంగా లోపలకి వెళ్లి, తాళాలు పగుల గొట్టి, మండపం తమదన్పించు కోవాలని చూశారట. ఆ ప్రయత్నమూ పూర్తిగా ఫలించినట్లు లేదు.

రామచంద్రా రెడ్డి గారు మండపాన్ని చాలా పవిత్రంగా వుంచే వారు. మాంసాహారం కూడా లోపలికి రానిచ్చేవారు కాదు. అక్కడ ఆయన స్వంత ఖర్చుతో నిత్యాన్నదానం ఇరవయ్యేళ్ల నుంచి జరుగు తూంది. ఇప్పుడూ దాన్ని కొనసాగిస్తున్నారు. ఇటువంటి పవిత్ర ప్రదేశాన్ని రౌడీలకు నిలయం చేయడం మధుసూదన శాస్త్రి వంటి విజ్ఞులు చేయదగిన పనికాదు. ఆయనెందు కింత కుసంస్కారంగా ప్రవర్తించారు?

ఈ దౌర్జన్యం చేసిన కిరాయి రౌడీల గుంపుకు యువజన కాంగ్రెస్ నాయకుడు కోటంరెడ్డి శ్రీనివాసులు రెడ్డి నాయకుడట. ఈ వృత్తి ఎప్పుడు ప్రారంభించాడు శ్రీనివాసులు రెడ్డి? ఆ పనిచేయ డానికి సిగ్గు వేయలేదా?

### 4 లక్షల స్థలానికి రూ30 వేల లంచం

ఆత్మకూరు గ్రామంలోని బస్టాండు ప్రక్కన అత్యంత విలువైన రోడ్డు మార్జిన్ స్థలాన్ని ఒక ప్రబుద్ధుడు ఆక్రమించి, నాలుగున్నర లక్షలకు వేరే వారికి అమ్మేశాడట. అత్త సొమ్ము అల్లుడు దానం చేసినట్లు ఈ లోపాయికారీ లావాదేవీకి అధికారిక ముద్ర వేశాడు ఆ గ్రామ సర్పంచ్ సోమా రమణయ్య. ఆక్రమించు కొన్న వారి నుంచి కొనుగోలు చేసే ఒప్పందం పత్రంలో సర్పంచ్ ముద్రతో సహా సంతకం చేసి, సాక్షిగా వుండేందుకు రూ.30 వేలు లంచం ముట్టిందట ఆయనకు.

ఆత్మకూరులో పంచాయితీ స్థలాలు అమ్మడంలో ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు, సర్పంచ్ లిద్దరూ పోటీలు పడుతుంటారు. పంచాయితీ ఆఫీసుకు ఆనుకొని వుండే స్థలాన్ని కూడా అంగడి కొట్లకు అమ్మేశారు వారు. తమకు దొరికినంత ముట్ట చెప్తేచాలు - ఏ స్థలంలో ఎవరే భవనం కట్టినా వీరికి అభ్యంతరం లేదు. ఇప్పటికే సగం భారీ స్థలాలిట్లా అమ్మేశారు. కలెక్టర్ గారు తీరిక చూసుకొని ఒకసారి విచారణ జరిపించడం మేలు - లేకుంటే ఆత్మకూరులో రోడ్లు కూడా మాయమై పోయేట్లున్నాయి.

### రాజేశ్వరమ్మతో రాఘవ రెడ్డి ఋణం తీరింది!

దర్గామిట్ట రాజరాజే శ్వరి దేవాలయం ఛైర్మన్ శ్రీ కెవి రాఘవ రెడ్డి



తన పదవికి రాజీనామా సమర్పించాడు. రాజేశ్వరమ్మతో ఆయన ఋణం తీరిపోయింది. పన్నెండేళ్లుగా ఆ దేవాలయమే తన ఇల్లన్నట్లు సేవ చేశాడు రాఘవ రెడ్డి. వీధి ప్రక్కన గుడిగా వున్న దానిని రాష్ట్రంలోని అతి పెద్ద దేవాలయాలలో పన్నెండవదిగా ప్రతిష్ట పెంచాడు. ఏడాదికి ఇరవై లక్షల

కొరవ / పేజిలో

## సణుగుడు

4 పేజీ కొరవ

గంజా కున్నారా అన్న విషయం దర్యాప్తు జరిపించడం అవసరం. ముఖ్య మంత్రి గారూ - మీ ఎమ్మెల్యేలంత దగుల్బాజీ తనంగా వ్యవహరిస్తున్నారో తెలుసు కోండి!

* * *

మునిసిపాలిటీలకు, మురికికి దగ్గరి చుట్టరికం. మురికి, మురుగు లేనిదే - అది మునిసిపాలిటీ అనే అన్పించుకోదు. దేశంలో ఎక్కడికి వెళ్లి చూసినా అదే పరిస్థితి. ఈ విషయంలో భారతీయులంతా ఒకటే. దేశభక్తి అనే బంధం కంటె ఈ మురికి అనుబంధమే భారతీయతను మహా బాగా వ్యక్తం చేస్తుందనడం నిజం. అయితే ఈ గంజాయి వనంలో తులసి మొక్కవలె తయారైందట - సూరత్ నగరం! ఇంగ్లీషు దిన పత్రికలు చెప్తున్నాయి.

సూరత్ అంటే ఇది వరకు వజ్రాల నగలు, సిల్కు వస్త్రాలు జ్ఞాపకానికి వచ్చేవి; ఇటీవల కొంత కాలంగా భయంకర ప్లేగు వ్యాధి గుర్తుకు వస్తుంది. రెండేళ్ల క్రితం - 1994లో ఆ నగరం ప్లేగు బారిన పడింది. సూరత్ నుంచి వచ్చిన మనిషి అని చెప్తే దేశంలో ఏ మారుమూల కూడా జనం తుపాకి దెబ్బకి కాకుల గుంపులాగా అతడి నుంచి దూరంగా పారిపోయే వారు. ఎప్పుడో యాభై ఏళ్ళనాడు అంతరించి పోయిందనుకున్న ప్రాణాంతక వ్యాధికి పురుడు పోసిందా నగరం. అందుకు కారణం - అక్కడి మురికి, మురుగులే; పారిశ్రామి కీకరణ కారణంగా విచ్చల విడిగా నగరం పెరిగిపోయి, లక్షల సంఖ్యలో జనం వలస వచ్చి, సరైన సౌకర్యాలు లేక, మురికి వాడలు విస్తరించి నానాకంపుగా తయారైందా సిటీ. దాన్నొక్కదాన్ని ఎందుకు ప్రత్యేకించాలి - దేశంలోని ముప్పాతిక భాగం సిటీల దుర్గతి ఈనాటికీ అదే! కాని ఆ ముదనష్టపు నగర జీవనానికి సూరత్ ప్రజలు పెద్ద పెనాల్టీయే చెల్లించారు - ప్లేగు వ్యాధి ప్రబలడం ద్వారా! అదే ప్లేగు వ్యాధి భయం ఇప్పుడు అదే నగరపు రూపు రేఖలే మార్చి పారేసింది.

ప్లేగు తర్వాత - అక్కడి మునిసిపల్ కమీషనర్‌గా ఎస్.ఆర్.రావు అనే ఆంధ్రుడు నియమితుడైనారు. ఆ చిన్న పదవిలో ఆయన ఒక కొత్త చరిత్ర సృష్టించారు. రెండేళ్ల క్రితం సూరత్‌ను చూసిన వారు ఇప్పుడక్కడికి వెళ్లి - అది సూరత్ అని నమ్మలేరు. అందుకు కారణం - ప్రపంచంలోని అత్యంత పరిశుభ్ర నగరాలలో అది ఒకటి కావడం. మొత్తం సిటీలో ఎక్కడ వెతికి చూసినా చెత్త కన్పించదు, మురికి వుండదు, మురుగునీరు పారదు, కాల్వలు గలీజుగా వుండవు. దోమ అమాకి కూడా దొరకదు, ఈగ బ్రతకదు; అది సూరతా, సింగపూరా అన్నది అర్థం కాదు.

చిత్తం చెత్త పెట్టుకొని జనాన్ని బిత్తర పెట్టి సాధించారీ ఘనకార్యాన్ని! ఎవరి ఇంటి ముందు చెత్త కన్పడినా - అది నాలుగు కాగితం ముక్కలైనా సరే - రు.500ల జుల్మానా అప్పటి కప్పుడే కట్టాలి. బుట్టల్లో పండ్లు అమ్మేవారు గడ్డి పోచలు క్రింద పడవేసినా, తోపుడు బండి దగ్గర బజ్జీలు తిని ఆకు జార విడిచినా పందల్లో పెనాల్టీ పడిపోతుంది. అంగళ్లు, హోటళ్లు, ఫ్యాక్టరీల నుంచి మురికి నీరో, కాల్చేసిన పొట్టో, చిమ్మిన కాగితాల చెత్తో వీధిలో పడిందంటే పాతికవేల నుంచి లక్ష రూపాయల వరకు అపరాధం అప్పటి కప్పుడే కట్టాలి; లేకుంటే ఆ అంగడి మూసేయాలి. ఒక బిందె నీళ్లు రోడ్లో తెచ్చి క్రుమ్మరించిన నేరానికి రు.50వేలు ఫైన్ వేశారట ఒక హోటల్ వారికి. ఇంకేంటి వారు హోటల్ నడిపేది? మూసేసి ఇంటికి వెళ్లారు. ప్రతి రోజూ కనీసం 40 ఆహార శాంపిల్స్ తీస్తారు. హోటళ్ల నుంచి! కాఫీలో తేడా వచ్చినా ఆ హోటల్‌కు మూతే గతి!

కనీసం పిల్లల చేత కూడా వీధిలో బహిర్భూమి కార్యక్రమం చేయించ డానికి లేదు; అది జరిగిందో - ఫైన్ కట్టడానికి నెల జీతం చాలదు. ప్రక్కింటి వాళ్లు చెత్త ఎత్తి వీధిలో పారేశారని ఫిర్యాదు చేస్తే - అది నిజమైతే - బహుమతి ఇస్తారు. అందుకని ప్రతి పౌరుడూ తన ఇంటి ముందు ఎవరూ చెత్త పోయకుండా ప్రక్కింటి వాళ్లను ఒక కంట కనిపెట్టి వుంటున్నారట. ఏ ఉద్యోగి పరిధిలోనైనా వీధి చిమ్మకున్నా, చెత్త తొట్టి శుభ్రం చేయకున్నా, తొట్లో నుంచి చెత్త క్రిందకు జారి కన్పించినా ఒక్క క్షణంలో సస్పెన్షన్ ఉత్తర్వులు చేతికి వచ్చేస్తాయి. అందుకని రాత్రింబవళ్లు డ్యూటీలు వేసుకొని వీధులు చిమ్ముతున్నా రక్కడ.

భారత దేశంలో ఇటువంటి అద్భుతాలు జరుగుతాయని, అదీ వరాయి రాష్ట్రంలో ఒక ఆంధ్రుడు సాధించాడని నమ్మడం చాలా కష్టం. కానీ అది నిజం - కావాలంటే నెల్లూరు మునిసిపల్ ప్రభువులు సూరత్ వెళ్లి చూచి రావచ్చు.

ఈ పరిశుభ్రత ఫలితంగా పౌరుల ఆరోగ్యం మెరుగు పడింది. డాక్టర్లు తెగ బాధ పడిపోతున్నారు. ఆస్పత్రులు పేషంట్లు లేక వెలవెల పోతున్నాయట. కొందరు డాక్టర్లు ఇంక ఇక్కడ బ్రతకలేమని వూరొదిలి వెళ్లిపోయారట.

నెల్లూరు మునిసిపల్ ఛైర్మను, కౌన్సిలర్లు వెంటనే రైలు ఎక్కవలసినంత గొప్పగా వుందక్కడి పరిస్థితి. చూసొచ్చి ఏమి చేస్తామంటారా? కనీసం మనమేమి చేయడం లేదో తెలుసు కున్నామన్న సంతృప్తి మిగులు తుంది కదా?



## చెన్నారెడ్డి

మొదటి పేజీ కొరవ

1978లో, 1989లో రెండుసార్లు కాంగ్రెస్‌కు అధికార యోగం పట్టించిన రాజకీయ చాణక్యు డాయన. ముఖ్య మంత్రిగా మాత్రం ఎందువల్లో రెండేళ్లకు మించి నిలువ లేకపోయారు. ఆ కొద్ది కాలంలోనే ఆయన తీసుకొన్న నిర్ణయాలు, అమలు చేసిన పథకాలు రాష్ట్రానికి శాశ్వతంగా వుపకరించాయి. తుఫాన్ షెల్టర్లు, తీరంలో గ్రీన్‌బెల్ట్, తీర గ్రామాలకు రోడ్లు, డ్రెయిన్లకు రిపేర్లు, ఇంటింటా దీపం, వూరూరికి బస్సు వంటి పథకాలన్నీ ఆయన మేధస్సు నుంచి పుట్టినవే. ఆపరేషన్‌కని అమెరికాకు వెళ్లి, ప్రపంచ బ్యాంకు నుంచి 700 కోట్లు అప్పుతెచ్చిన ఘనుడాయన. భవిష్యద్దృష్టి కల్గి వుండడం ఆయనకు దేముడిచ్చిన గొప్ప వరం.

ఆ మహావ్యక్తి మరణించినా, ఆయన స్మృతి చాలా కాలం నిల్చి వుంటుంది. ఆంధ్ర రాష్ట్రం, మరీ ముఖ్యంగా తెలంగాణా ప్రాంతం విజ్ఞుడైన ఒక రాజకీయ వాదిని కోల్పోయింది.

## నేటిభారతం

2 వ పేజీ కొరవ

*కన్నవారికి అన్యాయం - ఇకపై నేరం!*

వృద్ధాప్యంలో కన్నవాళ్ళను కనికరించడం ఇకపై బిడ్డల దయాభిక్ష ఎంత మాత్రం కాదు! కనీసం హిమాచల్ ప్రదేశ్ వరకైనా ఇది సత్యం! తల్లి దండ్రుల ఆస్తుల్ని అనుభవిస్తూ వారిని మెడబట్టి గెంటివేసే సంతాన రత్నాలను కోర్టులో రచ్చ కెక్కించి, వారి నుంచి తగిన పరిహారం పొందవచ్చును. హిమాచల్ ప్రదేశ్‌లో త్వరలో ఈ మేరకు ఒక చట్టం తయారు కాబోతున్నది. వయోవృద్ధులూ! జై బోలో హిమాచల్ ప్రదేశ్‌కి!

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ కొరవ

ఆదాయం కల్పించాడు. విరాళాలు సేకరించి 50 లక్షల రూపాయలకు పైన ఖర్చు పెట్టి రెండు కళ్యాణ మండపాలు, క్యూ కాంప్లెక్స్‌లు, గాయత్రి దేవాలయం, నవగ్రహ మండపం వంటివన్నీ కట్టించాడు. నవరాత్రి ఉత్సవాలు కళ్లు జిగేల్ మనేటట్లు జరిపించాడు. ఇప్పుడు గౌరవంగా పదవి నుంచి తప్పుకున్నాడు.

రాజేశ్వరమ్మ దురదృష్టం - కొత్త పాలక మండలికి మంత్రి రమేష్ రెడ్డి చేసిన నియామకాలు పరమ హీనంగా వున్నాయి. అమ్మవారి నగలు ఎత్తుక పోయిన ప్రబుద్ధులు ఇప్పుడు అమ్మవారి ఆలయానికి పాలకులైనారు. పాపం - ఆ తల్లి వీరినెట్లా భరిస్తుందో!

### మరణం

పినాకినీ విద్యాపీఠం అధ్యక్షుడు, పాటూరు కోఆపరేటివ్ క్రెడిట్ సొసైటి అధ్యక్షుడు శ్రీ చెరుకుమూడి లక్ష్మీ నరసింహా రావు 5 తేది పరమ పదించారు. ఆయన వయస్సు 88 సంవత్సరాలు. విద్యాపీఠానికి గత ముప్పయ్యేళ్లుగా ఆయనే అధ్యక్షుడు. న్యాయవాది. స్వర్గీయ పాటూరు రాజగోపాల రావు ఆయన అల్లుడు. వారి కుటుంబానికి మా సానుభూతి.

## షేర్ మార్కెట్

2 వ పేజీ కొరవ

వారి దగ్గరున్న ఫిక్సెడ్ డిపాజిట్లలో 10 శాతం షేర్లపై పెట్టుబడి పెట్టేటట్లు నియంత్రిస్తే మార్కెట్‌లోకి 10 వేల కోట్ల డబ్బు ప్రవహి స్తుంది.

ప్రైమరీ మార్కెట్‌కు సంబంధించి పబ్లిక్ ఇష్యూకు వచ్చే కంపెనీల పట్ల చిన్న ఇన్వెస్టర్లలో విశ్వాసం కల్గించే చర్యలు చేపట్టాలి. కోర సెక్టార్‌లోని సిమెంట్, స్టీలు, విద్యుత్ వంటి రంగాలకు చెందిన కంపెనీలు తప్ప - ఫైనాన్స్ కంపెనీలు, గొర్రెలు బర్రెల పథకాల కంపెనీలను మార్కెట్‌లోకి రానివ్వకుండా సెబి జాగ్రత్త పడాలి.

ఇటువంటి కఠిన చర్యలు తీసుకోనిదే షేర్ మార్కెట్ బాగుపడదు; ఆర్థిక పురోగతి సాధ్యం కాదు.



కోనసీమ తుఫాన్ బాధితుల కోసం ఎసిపి పూర్ణచంద్ర రావుకు పదివేల విరాళమందిస్తున్న నెల్లూరు, సాయినాథన్ అండ్ కో యజమాని పత్తి నరసింహాలు శ్రేష్టి; ఎమ్మెల్యేలు సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి, కంభం విజయరామి రెడ్డి.

## జనవాణి

3 పేజీ కొరవ

మరెందరివో ఇల్లు వాకిళ్లు గంగ పాలయ్యాయి. విధికి ప్రతి ఒక్కరూ తల వంచక తప్పదు.

స్వచ్ఛంద సంస్థలు, వితరణ శీలురు, దయార్ద్ర హృదయులు తమ శక్తిమేర చేయూత నందిస్తున్నారు. ముఖ్యమంత్రి కూడా తాను చేయగలిగిందంతా చేస్తున్నారు. చిన్న వాడైనా ప్రయత్నశీలి. పట్టుదల గల గట్టి మనిషి. కాని ఈ తాత్కాలిక సహాయం ఎంత కాలం? శాశ్వత ప్రాతిపదికపై చేయదగిన ఏర్పాట్లు ఎప్పుడు? అభాగ్యుల బాధలు తీరెదెప్పుడు?

నెల్లూరు — సాదు కృష్ణప్రసాద్

### మునిసిపల్ వాటర్ సరఫరా చాలదు!

మునిసిపల్ వాటర్ సరఫరా ఇంత అధ్వాన్న స్థితికి రావడానికి లోపమెక్కడుంది? కరెంటు ఉంది; పెన్నలో నీళ్లు దండిగా వున్నాయి. అయినా నీటి సరఫరా ఉదయం గంటన్నర సేపు, సాయంత్రం ఒక గంట మాత్రమే. బోరింగులు బావులు లేని వాళ్లకు ఇవి చాలవు.

ఎన్నిసార్లు కౌన్సిలర్లతో మొత్తుకున్నా, ఛైర్మన్‌తో వ్రాత మూలకంగా మొర పెట్టుకొనా ఫలితం ఉండటం లేదు. మోటార్లు చెడి పొయ్యాయనో, బాగు చేస్తున్నారనో, త్వరలో నీటి సరఫరా బాగుంటుందనో నమ్మ బలుకుతారు. ఆ తర్వాత షరా మామూలే. ఇప్పుడే ఇట్లుంటే ఎండా కాలంలో మా బోటివాళ్ల గతి ఏం కావాలి?

నెల్లూరు — యస్.రంగా

## పంచాంగమ్

### ముహూర్తములు

తేది 13 శుక్రవారము ఉదయము 8.00 గంటలకు ధనుర్లగ్నమున గృహారంభ, వ్యాపారములకు సముహూర్తములున్నవి.

### డిసెంబరు తిథులు

కార్తీక బహుళ

తే 7 శని ద్వాదశి రా.గ. 12.50 వ
తే 8 ఆది త్రయోదశి రా.గ. 12.15 వ
తే 9 సోమ చతుర్దశి రా.గ. 11.56 వ
తే 10మంగ అమావాస్య రా.గ. 10.50వ

మార్గశిర శుద్ధ

తే 11 బుధ పాడ్యమి రా.గ. 9.16 వ
తే 12 గురు విదియ రా.గ. 7.28 వ
తే 13 శుక్ర తదియ రా.గ. 6.00 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.,

## టి.వి.ఆర్ సర్వజన సన్మిత్రుడు

వి.ఆర్.కళాశాల మాజీ మేనేజర్ టి.వి.రమణారెడ్డి గారు మరణించినట్లు జమీన్‌రైతు ద్వారా తెలుసుకొని చాలా బాధ పడ్డాను. ఆయనెంతో సౌమ్యుడు. 1973 అక్టోబరులోనో లేక డిసెంబరులోనో నాకు బాగా గుర్తులేదు - శ్రీ టి.వి.ఆర్. గుణగణాలను శ్లాఘిస్తూ అప్పటి మా సహచరుడు 'గోపి' చాలా చక్కని వ్యాసం వ్రాశారు. ఈ విషయం నేను టి.వి.ఆర్. గారికి చెప్పాను. ఆయన నవ్వుతూ - "అది నేను చనిపోయాక రాయాల్సింది; గోపి తొందరపడి ముందే రాశాడు" అన్నాడు. ఆ మాటలు ఇప్పటికీ నా చెవిలో మ్రోగుతున్నాయి.

హైదరాబాద్ — డి.జనార్ధనరెడ్డి

### మాటలతో ఆట — 31 సమాధానాలు

అడ్డం: 1.విభూతి 3.పదారు 5.నిరంతరం 8.పాఠం 9.మున్నీరు 10.పరాతి 11.బెరుకు 12.పరిమ 13.చము 14.అరకు 15.మిరక 16.కల్ల 17.తొలగు 19.జాలి 20.రుజువు 23.కల 24.గామురు 25.తక26.మలము 27. దుబం 28.కోతలు 29.వరు 31.లపా 33.ధూమము 36.మాతుల 37.చతి 39.పలి 40.వాకలి 41.వెంకయ్య 42.ప్రణుతి 44.చెప 45.లతిక 46.కలవరము నిలువు: 1.విహగం 2.భూజం 3.పన్నీరు 4.దారు 5.నిరాశ 6. రంతి 7.రంగము 9.ముందురు 10.పరికరము 11.బిరగు 12.పద 13.చల్ల 14.అలక 15.మిరి 16.కాని 17.తొరదు 19.జాలము 21.జరుదు 22.పంకము 23.కలలు 24.గాయం 26.మిరము 28.కోమలి 30.గతుకు 32.పాచిక 33. ధూపము 34.మలి 35.తేపతి 38.తియ్యని 40.వేలుక 41.వెంపర 42.ప్రతి 43.నక 44.చెక

సరైన సమాధానాలు పంపినవారు: యస్. కోటయ్య, నెల్లూరు; జి. సుజాత, నెల్లూరు; ఆర్. రమేష్‌చంద్ర, ఒంగోలు; టి.వి.ఎస్. శాస్త్రి, తిరుపతి; పి. గిరిజ, గూడూరు; అమృత నిర్మల, నాయుడుపేట; గిరి బాపనాయి, చిత్తూరు; యస్. కోటిరెడ్డి, ఆత్మకూరు; పసుపు శైలజా కుమారి, సింగరాయకొండ; విజేత: యస్. కోటయ్య

## యం.ఆర్.ఓ. డీలరు కూడబలుక్కున్నారా?

ఉదయగిరి మండలం బిజ్జంపల్లి గ్రామ చౌకడిపో డీలరు యం.తిప్పారెడ్డి 1996 జనవరి నుండి నవంబరు ఆఖరు వరకు పామాయిలు, గోధుమలు తీసుకొని రాలేదు. నవంబరు నెల 20తేది తర్వాత కార్డుకు 3లీటర్ల కిరసనాయిలు ఇచ్చారు. "ఆగష్టు నెలలో మీరు పెట్టుకొన్న అర్జీలపై విచారణ జరిగింది. వాటివల్ల ధూపం తెగిందా?" అంటూ వీధుల్లో పరుషంగా మాట్లాడుతున్నారు" ఇంత బరితెగించి మాట్లాడ డానికి కారణం యం.ఆర్.ఓ. ఇచ్చిన చనువు, భరోసాయే! బియ్యం కె.జి. రు.3.60 చక్కెర కె.జి రు.10/-లు కిరోసిన్ లీటరు 3.25 గోధుమలు కె.జి. రు.4/-లు, పామాయిల్ కె.జి. రు.30/-లు చొప్పున అమ్ము తున్నారు. ఈ విచ్చలవిడి తనానికి అంతమే లేదా?

బిజ్జంపల్లి — ఎ.వెంకటసుబ్బారెడ్డి, పంచాయతీ మెంబర్

## పార్వతమ్మ

4 వ పేజీ కొరవ

పొయ్యే అవకాశాలు జాస్తి. దానివల్ల ప్రజల అవసరాలు తీరవు. మీ ఆశయాలు నెరవేరవు. కాబట్టి మీరే స్వయంగా ఆ మంచి నీటి పథకం చేపడితే ప్రజలకు మేలు జరుగుతుంది. మీ పేరు నిలబడు తుంది " అని ఒక విలేఖరి చేసిన సూచనను శ్రీమతి పార్వతమ్మ ఆమోదించారు.

సుబ్బరామరెడ్డి గారు పరమ పదించి ఏడాది అయింది. ఈ సందర్భంగా వికలాంగులకు ఒక ఆస్పత్రిని నెలకొల్పినట్లు ఆమె చెప్పారు.

కందుకూరు నియోజక వర్గంలోని రాళ్లపాడు ప్రాజెక్టు ఆయకట్టు 20వేల ఎకరాలు; వరదల వల్ల చెరువులు తెగి దాని మీదపడి రింగ్‌బండ్ ధ్వంసమైంది. ప్రతిసారి రింగ్‌బండ్ కట్టడం, మళ్లీ వానలకు వరదలకు కుప్ప కూలిపోవడం జరుగు తూంది. కాబట్టి కట్టుదిట్టమైన ఏర్పాట్లతో రింగ్ బండ్‌ను దిట్టంగా నిర్మించాలని కలెక్టరు గారికి విజ్ఞప్తి చేశాను. అవసరమైతే ఇందుకు తన సొంత ధనమైనా ఇవ్వడానికి సిద్ధమేనని ఆమె కలెక్టరు గారితో చెప్పారట. భైరవరం చెరువుకు 30లక్షలు అనుమతి సంపాదించాను. వింజమూరు మండలం గుండెమడకల కాజ్‌వేకి ఎఫ్.డి.ఆర్. ఫండ్సు కేటాయించాలని ప్రతిపాదనలు వెళ్లాయి.

వరదల వల్ల రైతుల పొలాల్లో ఇసుక మేట పడిపోయి ఉంది. కొన్ని ఊళ్లలో రాళ్లు మేట పడ్డాయి. ఈ మేటల్ని తొలగించుకునే ఆర్థిక స్థోమత రైతులకు లేదు అందువల్ల ప్రభుత్వమే బుల్డోజర్లతో మేటలు తొలగించాలి. లేకపోతే ఆ పొలాలు వ్యవసాయ యోగ్యతను శాశ్వతంగా కోల్పోతాయి అన్నారామె.

మాగుంట సుబ్బరామ రెడ్డి ఛారిటబుల్ ట్రస్ట్ ద్వారా ప్రతి నెల ఒకటవ తేదిన ఒంగోలు పార్లమెంటు నియోజకవర్గంలో ఒక్కొక్క మండల కేంద్రాన్ని ఎన్నుకొని ఉచిత నేత్ర శిబిరాన్ని నిర్వహిస్తున్నట్లు కూడా చెప్పారు.

## మాటలతో ఆట - 33

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | | | | ■ | 2 | 3 | | ■ | 4 | 5 |
| 6 | | | ■ | 7 | 8 | | | ■ | 9 | | |
| 10 | | ■ | 11 | | | ■ | 12 | | ■ | | |
| | ■ | 13 | ■ | 14 | | 15 | ■ | 16 | 17 | ■ | |
| ■ | 18 | | 19 | ■ | 20 | | ■ | ■ | 21 | 22 | ■ |
| 23 | | ■ | 24 | 25 | ■ | 26 | 27 | 28 | ■ | 29 | 30 |
| | ■ | 31 | | | 32 | ■ | 33 | | 34 | ■ | |
| 35 | 36 | | ■ | 37 | 38 | 39 | | ■ | 40 | 41 | |
| ■ | | ■ | 42 | ■ | 43 | | ■ | 44 | | | ■ |
| 45 | ■ | 46 | | 47 | | ■ | 48 | | | ■ | 49 |
| 50 | 51 | | ■ | | ■ | 52 | | | ■ | 53 | |
| 54 | | ■ | 55 | | | | ■ | 56 | | | |

### అడ్డం:

1. 7కు గడకట్టు; రక్షణ (4)
2. ఊదుకోవికలో ప్రయత్నం (3)
4. ఈతి బాధలు లో మొదటి రెండు (2)
6. గుర్తును చింతచితే మిగిలేది (3)
7. ఎన్నటికి ఈడేరని ఆడపిల్ల (4)
9. ఆరు+ఆరు కలపండి (3)
10. క్రీస్తు శకంలో 1,2,5వద్దు (2)
11. "వన"కు ట చేర్చు; శోకం (3)
12. అంగుళంలో 'అం' పోతే మిగిలింది తిరగబడింది (2)
14. వికారంగా ఉండేవారు (3)
16. బ్రహ్మరైన పుట్టు- తెగులు (2)
18. బహుపన్నవి పుల్లలు; మతో మొదలు (3)
20. అంతరిక్షంలో ఒక వాహనం (2)
21. బంది ఖానా (2)
23. వింటే ఆకాశం (2)
24. ఆదాయంలో కూడబెట్టు (2)
26. ముఖము వికృతి ఖ తీసి క పెట్టు (3)
29. అరుదైన విధి (2)
31. బానిసతనము నుండి తన తీసెయ్ (4)
33. లగ్గ అంటే మేలు. దీని బహువచనం (3)
35. వెళ్తా, చెరారం: రప్పిస్ (3)
37. రి; ర; లను ముందు వెనుకలు చేయ్; చక్రువులో 'చ' వద్దు. కలుపు; రక్షించాలి అనుకొనేవాడు (4)
40. 'నటి'కి ముందు 'వె' కుత్సితుడు (3)
43. సదాజపలో పదా వద్దు (2)
44. 'లాడి' అంటే కొరమేను పిల్ల; ముందు అక్షరం చేరిస్తే మోసగాడు (3)
46. ఆని పఠికములో వెరండి; ఎల్లప్పుడు (4)
48. విదు (3)
50. కష్టం (3)
52. చెట్టు (3)
53. పహారులో అందం; ప్రియ - శిలే! (2)
54. రుషి (2)
55. గడను ఎత్తుకొంటే పన్నాగం (4)
56. ప్రథమావిభక్తి (4)

### నిలువు:

1. గుర్తపిలికలో రాజా (3)
2. పొట్టు (2)
3. నిమ్మకు నీళంలో వెక్కురి విశ్రాంతి (3)
4. ఈదు+ఆరు కలపండి (3)
5. తిరుపతి కొండ (4)
6. పేరు; కంక; లంక ఒక్కొక్క అక్షరం విరండి; కోయిల (3)
7. మానవ పుంలింగం; దీనికి స్త్రీలింగం రాయండి (3)
8. చమట కారిందిలో ఆంగ్లో ఇండియన్ (4)
13. గల్లుమనే గజ్జె (2)
15. రెక్క ఎక్కండి; "ము" అనండి; వెలుగబంటి (3)
17. చెమ్మ కింది నుంచి పైకి (2)
18. "చను" మారి "చు" వచ్చింది (2)
19. ఆ విలు చెల్లాచెదరు (3)
22. వారు (2)
23. వి యత్తలములో ధనం (3)
25. విష్ణుభక్తుడైన శూద్రుడు (3)
27. ఉన్నాయి (3)
28. ముంగిట్లో గీతలసొగసు (3)
30. వలికాలంకదా; విప్పకప్పుకోండి (3)
31. అప్పు (2)
32. ముందర జపములో చూస్తే మృదంగం(4)
34. వెలుగు అది అది చెల్లా చెదురయ్యారు (4)
36. వృథా (2)
38. పాడి (3)
39. పక్షులు ఎగిరి మిగిలింది జారుమారు (2)
41. మర్యన (2)
42. హండిలో నీరు (2)
44. జాదుగాడు (4)
45. తల (3)
46. తుమ్మెద (2)
47. కార్తీకమాసం ఏ రుతువులో వస్తుంది? (3)
52. మద్రాసుకు దగ్గరలో తెలుగు గ్రామం (2)
53. మరణం (2)

## వరద సహాయం

జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్వర్యంలో ఎసి సుబ్బారెడ్డి కూరగాయల మార్కెట్టు వద్ద వరద సహాయ నిధి వసూలు చేశారు. శ్రీ ఆనం సంజీవ రెడ్డి దీనికి నాయకత్వం వహించారు. మొత్తం 10 వేల రూపాయలు మాజీ ముఖ్య మంత్రి జనార్ధన రెడ్డికి డిడి ద్వారా పంపారు.

## ఎన్ఎస్‌కె

4 వ పేజీ కొరవ

ప్రకటించారు. న్యాయవాది శ్రీ అనంతరామయ్య రు.1116/-లు విరాళం ప్రకటించారు. శ్రీ హెచ్.యస్.వి. రంగారావు ప్రతి ఏటా రు.500/-లు ఇవ్వడానికి సంసిద్ధులయ్యారు. వర్ధమాన సమాజ కార్యదర్శి శ్రీ పొన్నాల రామసుబ్బారెడ్డి వందన సమర్పణ చేశారు.

# "రాజకీయాల్లోకి రావాలనుకొంటే నేను తీసే సినిమా చూడనేవద్దు!"

"రాజకీయాలలో ప్రవేశించా లని ఉబలాట పడేవారు ఈ చిత్రం చూస్తే ఆ ఉద్దేశ్యాన్ని మానుకుంటారు. అంత శక్తివంతమైన ఇతి వృత్తం." అన్నారు. ఎస్. గోపాలరెడ్డి. ఈయన నిర్మించే "రథయాత్ర" చిత్రంలో రాజశేఖర్, రోజా, దగ్గుబాటి రాజా, అంజా అరవింద్, కాస్ట్యూమ్ కృష్ణ తనికెళ్ళ భరణి, సంగీత, అశోకకుమార్, ముక్కూ, వెంకటేశ్వరరావు వగైరా తారాగణం. మాటలు: గణేష్ పాత్రో. సంగీతం: విద్యాసాగర్. "డిసెంబర్ 25కి షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు డైరెక్టర్ కోడి రామకృష్ణ.

## డాక్టర్ ప్రభాకరరెడ్డి ఆకస్మిక మరణం

నటుడు, కథకుడు, నిర్మాత, దర్శకుడు డాక్టర్ ఎం. ప్రభాకరరెడ్డి నవంబరు 26 ఉదయం ఎనిమిదింబావుకి హృద్రోగంతో హైదరాబాద్‌లో హఠాత్తుగా మరణించారు. 470 చిత్రాలలో నటించి, 27చిత్రాలు నిర్మించిన ఈయన "పల్లె పిలిచింది, యువతరం కదిలింది" చిత్రాలలో నటుడుగా నంది అవార్డు అందుకున్నారు. వయసు 63. భార్య, నలుగురు కుమార్తెలు ఉన్నారు. మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి వెంటనే ప్రభాకర రెడ్డి గృహానికి వెళ్ళి వారి కుటుంబానికి సానుభూతి తెలిపారు.

## బొమ్మలబాపు

బాపు న్యాయ శాస్త్రంలో పట్టభద్రుడు. ఆయనకు చిత్ర లేఖనం హాబీ అయితే, చిత్ర దర్శకత్వం వృత్తి. తొలుత బొంబాయిలోనే జె.జె.స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చిత్ర లేఖనాన్ని వాణిజ్య పరంగా అభ్యసించాలను కున్నారు. కాని, అడ్వకేట్ అయిన ఆయన తండ్రిగారు "ముందు ఒక వారం రోజుల పాటు లా కాలేజీకి వెళ్ళి చూడు. నచ్చకపోతే ఆ తర్వాత ఆర్ట్స్ స్కూల్లో చేరొచ్చు అని సలహా ఇచ్చారు. బాపు లా కాలేజీలో చేరిన కొంత కాలానికి తండ్రి పరమ పదించారు. "నాన్న గారి కోర్కె తీర్చడం కోసం లా చదివాను. నా ఆశయం మేరకు బొమ్మలు", అంటారు బాపు.

## "కాప్రైడ్" డిసెంబర్‌లో

డాక్టర్ ప్రభాకరరెడ్డి దర్శకత్వం వహించిన చివరి చిత్రం "కాప్రైడ్"; నవంబర్ 25 రాత్రి ఆ చిత్రం రీ రికార్డింగును పూర్తి చేసి ఇంటికొచ్చి విశ్రమించా రాయన; ఆ నిద్రలోనే దివంగతు లయ్యారు; తిరిగి లేవలేదు. భాను చందర్ హీరోగా నటించిన ఈ చిత్రం డిసెంబర్ మాసంలో విడుదలవు తుంది.

# సుహాసినికి కమల్ అనునయం!

సుహాసిని నటించిన చిత్రాలు ఎన్ని చూసినా ఆమె బాబాయ్ కమలహాసన్ ఒక్కసారైనా మెచ్చుకో లేదట. కాని ఆ మధ్య ఒక తమిళ చిత్రంలో స్టంట్ సీన్‌లో నటిస్తున్నప్పుడు అజాగ్రత్త మూలంగా ఆమెకు దెబ్బలు తగిలాయి. ఆమె చేతికి కట్టుతో ఉండగా చూసిన కమలహాసన్ "నేను నేను ఇంతటి వాడినవ డానికి ముందు ఇలాంటి దెబ్బలు ఎన్నో తిన్నాను" అన్నాడట ఓదార్పుగా. ఆ మాటే తనకు పెద్ద మెచ్చుకోలుగా సంబర పడిపోతూ వుందా నటి. కమల్‌కు

విడాకులిచ్చేసినా తొలిభార్యకింకా ప్రేమ తగ్గలేదు!

- విడాకు లిచ్చిన మొదటి భార్య మద్రాసుకు ఎప్పుడొచ్చినా సుహాసిని ఇంట్లో దిగుతుంది; ఇంటికి రాగానే ఆమె అడిగే మొదటి ప్రశ్న – "మా బాబాయ్ కులాసాగా వున్నారా?" అని

కళ్యాణప్రాప్తిరస్తు చిత్రంలో కావ్య, వంశీ

## "రుక్మిణీ కళ్యాణం"

రవిరాజా పినిశెట్టి దర్శకత్వంలో తయారయ్యే "రుక్మిణీ కళ్యాణం" చిత్రంలో వినీత్ సరసన నటి మంజుల కుమార్తె ప్రీతి నాయిక.

## వినోద్‌కుమార్ వివాహం

వేదితా శెట్టి అనే మంగుళూరు వనితతో వినోద్‌కుమార్ కళ్యాణం ఫిబ్రవరి 26న జరగబోతుంది.

## క్రూర జంతువుతో తొలి నటి

తెలుగు చిత్రంలో మొట్టమొదటి సారిగా క్రూర మృగంతో నటించిన తార ఎవరో తెలుసా? కన్నాంబ. 1940 లో తయారైన "చండిక" చిత్రంలో ఆమె చిరుతపులితో నటించింది. ఆ పులికి నోరు కుట్టేసి. షూటింగ్ జరపాలను కున్నారు. "పాపం! దాని నోరు కుట్టేయకండి. చాలా బాధ పడుతుంది. ఒక రెండు రోజులాగి షూటింగును పెట్టుకోండి." అని కన్నాంబ కోరింది. మర్నాటి ఉదయం ఆమె ఆ పులి బోను దగ్గరికి వెళ్ళి స్వయంగా మాంసాహారం అందించింది. ప్రక్క రోజు పులిని బోనులోంచి బయటకు తెప్పించి, మేత

కొరవ 11 పేజీలో

ఏ కోణం నుంచి చూసినా దర్శకుడి సత్తా కన్పించడం లేదు!

# అమ్మా! దుర్గమ్మ!

చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

దేవతలను, వారి మహత్యాలను, క్షుద్ర శక్తులను మూఢ నమ్మకాలను, మంత్ర తంత్రాలను ఆధారంగా చేసుకొని, సాయి ప్రకాష్ కథ వ్రాసి, స్క్రీన్ ప్లే కూర్చి, దర్శకత్వం వహించి "అమ్మా దుర్గమ్మ" చిత్రాన్ని రూపొందించారు. చిత్రం సగం వరకు రెండు కుటుంబాల వ్యవహారాలు, ఆ కుటుంబాలకు సంబంధించిన అబ్బాయి అమ్మాయి ప్రేమ కలాపాలతో నిండిపోతుంది. ఆ తర్వాత దుర్గమ్మ మహత్తు జొరబడు తుంది.

శంకర్ (శశికుమార్) అమెరికాలో పెరిగి పెద్ద వాడై ఇండియాకు తిరిగొచ్చి తన తాత (నర్రా), అవ్వ (డబ్బింగ్ జానకి)కు చెందిన పొలాల్లో వున్న ఇంట్లో మకాం పెట్టాడు. తన మరదలు గౌరిని (ఊహ) ప్రేమిస్తాడు, పెళ్లి చేసుకుంటానని మాటిస్తాడు. శంకర్ తల్లి (వై.విజయ) తండ్రి (ప్రసాద్‌బాబు) ఈ పెళ్లికి అంగీకరించరు. ఉన్నట్లుండి వీరభద్రుడు (రంగనాథ్) శివశక్తి (రాంరెడ్డి) అనే ఇద్దరు మంత్రగాళ్ళు ఈ వ్యవహారంలోకి ప్రవేశిస్తారు. వీరభద్రుడు మంచి మంత్రగాడు; శివశక్తి చెడ్డ మంత్రగాడు. వీరభద్రుడు గౌరి వైపు నిలచి, గౌరి పెళ్లి శంకర్‌తో జరిపించాలని ప్రయత్నిస్తాడు. అలా జరగకూడదని శివశక్తి వారికి వ్యతిరేకంగా నిలుస్తాడు. ఈ విషయంలో ఇద్దరు మంత్రగాళ్ళ మధ్య క్షుద్రమంత్రాలతో యుద్ధం సాగుతుంది. శివశక్తి తన కూతుర్ని శంకర్ కిచ్చి పెళ్లి చెయ్యాలని ప్రయత్నిస్తాడు. శివశక్తి కూతురు దెయ్యమై శంకర్‌ను ఆవహిస్తుంది. శంకర్‌ను పెళ్లి చేసుకోవాలన్న గౌరిని

కొరవ 11 పేజీలో

## మరుగున పడిన మహాకవి

# అభినవ కేతన రేవూరు సుబ్బారావు

(విఖ్యాత ఆంధ్ర మహాకవి "అభినవకేతన" కీ.శే. రేవూరు సుబ్బారావు గారి 90వ జయంతి సందర్భంగా ఈ వ్యాసం).

రేవూరు సుబ్బారావు గారు "అభినవకేతన" బిరుదాంకితులు. కవిబ్రహ్మ, ధర్మాభిలాష, విప్లవార్ణం, భగవన్నుతి, ఋతు విహారం, కృష్ణలీలాభ్యుదయం అనేవి ఆయన వ్రాసిన, అచ్చయిన కావ్యాలు. "తపతీ సంవరణం" అముద్రితం.

సుబ్బారావు గారికి తిక్కన కావ్యకళా గురువు. అందువల్లనే తిక్కన జీవితాన్ని "కవిబ్రహ్మ" అన్న కావ్యంలో కళ్లకు కట్టారు. తిక్కన రాసిన నిర్వచనోత్తర రామాయణం వలె

**డాక్టర్ నరసింహారెడ్డి**
**ఎం.ఎ., పి.హెచ్.డి.,**

"కవిబ్రహ్మ" కావ్యం కూడా నిర్వచనమే. విరాట పర్వంలోని అవతారికలో ఉన్న విషయాలను, సిద్ధేశ్వర చరిత్రలోని సంగతులను ఆధారంగా చేసుకొని సుబ్బారావు గారు "కవిబ్రహ్మ" కావ్యాన్ని రాశారు. తిక్కన పాత్రను చిత్రించడంలోను, పోషించడం లోనూ, చక్కని ఔచిత్యాన్ని ప్రదర్శించారు. తిక్కన మూర్తిని కవి చిత్రించిన తీరు రమ్యాతి రమ్యం. ఊహా చిత్రమే అయినా ఒహో అనిపించి, తిక్కన స్వరూపాన్ని చెక్కు చెదరకుండా మనఃఫలకంలో భద్ర పరుస్తుంది. తిక్కన వేషధారణను ఒక్క సీసంలో మూసపోసి తీసినట్లుంటుంది.

"పండు వెన్నెల నిగల్ పరగుదు
కొలంబు
పొందుగా పింజలు పోసికట్టి
బంగారు సరిగ చెరంగుల పుట్టంబు
వలిపొప్పుగా వల్లెవాటువైచి
జిలుగు జరీపేటు తులకింప తెల్లని
తలపాగ శిఖ పెంపలర చుట్టి
రుచిర మౌక్తికయుత రుద్రాక్షమాలిక
తరగలదరంగ సరుతదాల్చి
భస్మగంధాక్షతాన్విత భాసురాస్య
నిటు పొదవిన బ్రహ్మతేజంబుప్రేక్ష
కుల విస్మయతాంత రంగుల సలుప
సుప్ర
సన్నుడై యొప్పు తిక్కన
సచివవరుడు".

సుబ్బారావు గారు రచించిన మరొక కావ్యం "ఋతు విహారం". ఇది మన ప్రాచీన సంస్కృతాంధ్ర కావ్యాలకు దేనికీ అనుకరణం కాదు. కవి "మనఃఖనిజం" నుండి పుట్టి పెరిగినది. వసంత ఋతుశోభను కవి వర్ణించిన విధానం ప్రశంసనీయం.

"అనిన తెనెలట్లు ప్రియమారగ తొట్టిల
నిండి భావిసం
జాన సుభార్థమా దలచు
తన్మధుపంబుల కాంక్ష పార్థకం
బొనన వచ్చునే? మనుజాల
మ్మధుపంబుల దోలి కొందుర
త్రైనియుల్, సుభార్థులు
మదింబరికింతురె? ధర్మ పద్ధతుల్.

సుభాభిలాష కలవాళ్లలో ధర్మాధర్మ విచక్షణ ఉండదని కవి చమత్కరిస్తారు.

నరశార్దూలుడైన రాముని "భగవన్నుతి శతకం"లో కవి ఇట్లా వర్ణిస్తారు. వాడిన వృత్తం కూడా శార్దూలమే కావడం విశేషం.

"ఆకుల్, కాయలు, పండ్లు,
మూలములు, నాహరించుచున్ హృద్యవా
పికాసార జలంబులానుచు సుఖోపేతా
నిల వ్యాప్తనా
నాకాంతార లతాంత గంధముల
నానందించుచున్ రాక్షసా
నీకంబున్ పొరిగొన్న రాఘవుడు
సన్నీతాత్ముడై బ్రోచుతన్"

లోకోపకారులకు త్యాగమేమూల ధనం. అని ధ్వని.

"ధర్మాభిలాష" కావ్యంలో భార్యాభర్తల అనుబంధాన్ని నేటి స్త్రీవాద కవయిత్రుల కంటె ఎంతో మిన్నగా చెప్పడం మనం చూడవచ్చు.

"భువన భరిత పంచభూతంబు లందు
ప్ర
శస్తమైన వహ్ని సాక్షిగా వ
రిగ్రహించినట్టి స్త్రీ దైవికంబయిన
చుట్టమెన్న పురుషునకు సఖుడ"

సుబ్బారావు గారు జరా, రుజాపీడితులై నప్పుడు కూడా కలాన్ని వదలి పెట్టలేదు. కవుల దేహానికే ముదిమి; వారి మనస్సు నిత్యనూతన యువ్వనోజ్వలితం దీన్నే కవి ఇట్లా అంటారు.

"ముదిమిలేదు కవికి ముని
మాపులును లేవు
నిదురలేదు కవికి నిన్నలేదు
వదలనేలు కవికి ఎల్లలైన లేవు."

ఎంత మంచి పద్యమో చూడండి. "నిన్నలేదు" అనడంలో కవి గతాన్ని కాదు భవిష్యత్తును చూస్తాడని ధ్వని పరిత్ప హృదయ సింహాసనాధిష్ఠులైన మహా కవులకు ఎల్లలు కూడా ఉండవు.

సుబ్బారావు గారు రచించిన కావ్యాలన్నింటిలోను కవిత్వానికి కొరత ఉండదు. కవిత్వం కూర్పులోను, నడకలోను, పలుకు బళ్లలోను గడితేరి ఉంటుంది. శైలి ప్రసన్న గంభీరం. కథ చెప్పే తీరులోగాని, వర్ణనా పటిమలోగాని, భావనా బలంలోను అన్నింటా మిన్నగానే ఉంటుంది.

"కవిః కరోతి కావ్యాని
రసం జానాతి పండితః" అన్నారు.

కావ్యాలు రాయడం కవుల వంతు; ఆ కావ్యాలలోని మంచి సెబ్బరలను లోకానికి విప్పి చెప్పేవారు విమర్శకులు. ప్రతిభా వంతులైన కవికి సమకాలంలో గుర్తింపు రాకపోయినా తర్వాత కాలంలోనైనా గుర్తింపు తప్పని సరి; రసమర్మజ్ఞులైన విమర్శకులు మరుగున బడిన కవుల ప్రతిభను లోకానికి చాటి చెబుతారు.



## వారఫలాలు

(7.12.96 నుండి 13.12.96 వరకు) వృశ్చికంలో రవి; తులలో శుక్రుడు; మీనంలో శని, కేతువులు; ధనుస్సులో గురు, బుధులు; కన్యలో రాహువుసింహంలో కుజుడు; సింహ, కన్య, తుల, వృశ్చిక, ధనుస్సులలో చంద్రుడు.



### మేషం
(అశ్విని, భరణి, కృత్తిక 1పాదం)

అనవసర విషయాలలో జోక్యం చేసుకొని సమస్యలు యిబ్బరదు కొంటారు. ఆత్మీయులుగా ఉండే వ్యక్తులతో అభిప్రాయ భేదాలు రాకుండా చూచుకోనవలెను. వ్యాపార ఉద్యోగ జీవనము కలవారికి ఆర్థిక పరమైన చిక్కులు ఎదురగును. పనులు నిదానముగా కొనసాగును. ఆర్థిక పరమైన హామీలు క్రొత్త వ్యాపార పెట్టుబడులు ప్రమాదము కలిగిస్తాయి. పిల్లల విద్యాభివృద్ధి బాగుంటుంది.



### వృషభం
(కృత్తిక 2,3,4, పాదాలు; రోహిణి, మృగశిర 1,2పాదాలు)

కుటుంబ, ఉద్యోగ సంబంధిత సమస్యలు చికాకు కలుగు [illegible]ను. వృత్తి, వ్యాపార, ఉద్యోగ జీవనము కలవారికి ఆదాయ లోపము క[illegible] వార ప్రారంభములో ప్రయాణము లుండును. ఆరోగ్యము సరిగా [illegible]ుండదు. వ్యవహారము లం[illegible] అనుకూలత ఉం[illegible] నూతన వస్త్రములు కొనటం. ఇతరులకు సహాయ పడటం జరుగుతుం[illegible]. కార్యశ్రమ ఎక్కువగా ఉంటుంది.



### మిథునం
(మృగశిర 3,4పాదాలు; ఆర్ద్ర; పునర్వసు 1,2,3పాదాలు)

ఆర్థిక పరమగు సమస్య లుండును. కుటుంబ వ్యక్తులతో బయట వ్యక్తులతో ఘర్షణ పడకుండా ఉండటం మంచిది. రావలసిన బాకీల కొరకు ప్రయత్నం చేయుటం మంచిది. పనులకు ఆటంకాలు ఎదురైనా నెరవేరగలవు. కుటుంబ సభ్యుల ఆరోగ్యలోపం ఆందోళన ఉంటుంది, పెద్దలతో పరిచయములు పెరుగును



### కర్కాటకం
(పునర్వసు 4వ పాదం; పుష్య; ఆశ్రేషలు)

వ్యవసాయ వ్యాపార జీవనము కల్గిన వారికి ఆర్థికంగా క్లిష్టపరముగా ఉంటుంది. వృత్తి ఉద్యోగాలలో బాధ్యతలు పెరిగి శ్రమ ఎక్కువగా ఉంటుంది. బంధువుల అనారోగ్య విషయాలు తెలుస్తాయి. గౌరవ మర్యాదలు బాగుంటాయి. కోర్టు వ్యవహారాలు, రాజకీయ వ్యవహారాలు మలుపు తిరుగుతాయి. కన్ను, చెవికి సంబంధించిన రుగ్మత లుంటాయి. కుటుంబ సమస్యల విద్యా వివాహ సమస్యలు ఆందోళన కలిగిస్తాయి.



### సింహం
(మఖ; పుబ్బ; ఉత్తర 1వపాదం)

వ్యవహారాలు, ప్రయాణాలు సమస్యలు కలిగించేనైనా ఆదాయ లోపం కలుగ కుండా నెరవేరుతాయి. వృత్తి వ్యాపార వ్యవసాయ దారులకు ఆర్థికంగా బాగుండును. శ్రమ ఎక్కువ, కుటుంబ సౌఖ్య మ్ముంటుంది. పిల్లల ఉద్యోగ ప్రయత్నాలు. ఆస్తుల సమస్యలు లాభిస్తాయి. ఆరోగ్య భావానికి లోపం లేదు. భోజన సౌఖ్యం, నూతన వస్తు లాభముంటుంది.



### కన్య
(ఉత్తర 2,3,4 పాదాలు; హస్త; చిత్త 1,2పాదాలు)

సమస్యలకు తగాదాలకు దూరంగా ఉండటం మంచిది. వ్యాపార వృత్తి ఉద్యోగ జీవనం కల్గిన వారికి సామాన్య ఆదాయ ముంటుంది. సత్కర్మలు జరిపి దోషాలను తొలగించు కొనడం మంచిది.

**స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.**

చిన్న చిన్న గాయాలు తగుల వచ్చు. కుటుంబ సమస్యల సౌఖ్యం. బాగుంటుంది. సామాజిక కార్యక్రమాలలో పాల్గొనే అవకాశా లుంటాయి.



### తుల
(చిత్త 3,4 పాదాలు; స్వాతి; విశాఖ 1,2,3 పాదాలు )

ఆర్థికంగా ఈ రాశి వారికి బాగుంటుంది. సన్నిహితముగా ఉన్న వారి వలన సమస్యలు కలుగుతాయి. వస్త్ర, నష్టము కలుగ వచ్చు. అనవసర ఖర్చులు పైన బడతాయి. మిత్రుల, అధికారుల సహాయ సహకారాలు బాగుంటాయి. పనులందు శ్రమ ఎక్కువగా ఉన్నను నెరవేరుతాయి. క్రొత్త వ్యక్తులతో పరిచయ ముంటుంది,



### వృశ్చికం
(విశాఖ 4పాదం ; అనూరాధ; జ్యేష్ఠ)

ఆర్థిక పరిస్థితులలో మార్పులుండవు. బంధువులను గూర్చిన వార్తలు వినటం, ప్రయాణాలు జరుగ గలవు. ఆరోగ్య విషయములో జాగ్రత్త పడటం మంచిది. పిల్లల విద్యా ఉద్యోగ ప్రయత్నములు అనుకూలిస్తాయి. అనవసర వ్యవహారాలలో తల దూర్చవచ్చు. బంధువులతో విభేదాలు కలుగ వచ్చు. కుటుంబ సౌఖ్య ముంటుంది.



### ధనుస్సు
(మూల; పూర్వాషాఢ; ఉత్తరాషాఢ 1వపాదం)

వృత్తి, వ్యాపార, ఉద్యోగ జీవనము కల వారికి ఆదాయం బాగుంటుంది. బంధు వియోగము కలుగ వచ్చును. స్థల మార్పులు, ప్రయాణాలు విస్తృత వచ్చు. బంధుమిత్ర, అధికారులతో తగాదాలకు దూరంగా ఉండటం మంచిది. ఆరోగ్య విషయాలలో జాగ్రత్త అవసరం. క్రొత్త పెట్టుబడులు, అప్పు లివ్వడం మంచిది కాదు. పనులు నిదానంగా జరుగుతాయి. అతిగా కలుగ జేసుకోవడం మంచిది కాదు.



### మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు; శ్రవణం; ధనిష్ఠ 1,2పాదాలు )

పనుల వత్తిడి ఎక్కువై శ్రమ ఎక్కువగా ఉంటుంది. మనస్తిమితం తక్కువ. అనవసరంగా ఇతరుల విషయాలలో కలుగ జేసికొని చిక్కులు తెచ్చు కుంటారు. ఆర్థిక పరిస్థితి సామాన్యం. సకాలంలో డబ్బు లభించక అప్పులు చేయవలసి ఉంటుంది. అధికారులు, బంధువుల విముఖత ఉంటుంది. ప్రతి విషయం జాగ్రత్తగా పరిశీలించి చేయాలి. కుటుంబ సభ్యుల సౌఖ్య ముంటుంది.



### కుంభం
(ధనిష్ఠ 3,4పాదాలు; శతభిష; పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

ఉద్యోగులకు పని భారము, స్థాన మార్పు కలుగ వచ్చును. ఆర్థికముగా ఈ రాశి వారికి బాగుంటుంది. ఇతరుల పనులను నిర్వహించి సహాయ పడవలసి ఉంటుంది. కుటుంబ సభ్యుల విద్యా, ఉద్యోగ సమస్యలు బాధ కలిగిస్తాయి. ఆరోగ్య విషయములో జాగ్రత్త అవసరం. ఆస్తి వ్యవహారాలు, అప్పు వ్యవహారాలు నిర్వహించడం మంచిది కాదు. మిత్రుల బంధువుల సహకారం ఉంటుంది.



### మీనం
(పూర్వాభాద్ర 4వపాదం; ఉత్తరాభాద్ర; రేవతి)

పనులు నిదానముగా జరుగును. ఈ రాశి వారికి ఆర్థిక స్థితి ఆదాయం బాగుంటుంది. కాని ఖర్చులు కూడా పెరుగుతాయి. నూతన వస్త్ర, వాహనములు కొను ప్రయత్నము లుంటాయి. వృత్తి ఉద్యోగులకు కార్యభారం శ్రమ ఉంటుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు. చిన్న గాయములు కలుగ వచ్చును. తొందర పడి నిర్ణయాలు తీసుకొని చిక్కులలో పడతారు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది.





నెల్లూరు రూరగాయల మార్కెట్‌లో తుఫాన్ బాధితుల కోసం జోలెపట్టి చందాలు దండుతున్న డిసిసి అధ్యక్షుడు ఆనం సంజీవరెడ్డి, దేవకుమార్ రెడ్డి.

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

అరుణమ్మ, కౌన్సిలర్లు భానుశ్రీ, ఆసియా బేగం, సుబ్బలక్ష్మి, సందాని బాషా, మధుసూధన్, భానుప్రతాపరాజు, యువజన కాంగ్రెస్ నాయకులు చిపెలపూడి రూబెన్, బాలసుధాకర్ ప్రభృతులు పాల్గొన్నారు.

## కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు పాలనార్హత లేదు!

"రాష్ట్రంలోని తుఫాను బాధితులకు సహాయం అందించడంలో విఫలమైన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పాలనార్హతను కోల్పోయాయని" మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురమల్లి జనార్ధనరెడ్డి విమర్శించారు. నెల్లూరులో శనివారం సాయంత్రం ఇందిరాభవన్‌లో జరిగిన ఒక కార్యక్రమంలో ఆయన పాల్గొని ప్రసంగించారు.

"కోనసీమకు దాపురించిన ఉప్పెన ముప్పును జాతీయ విపత్తుగా గుర్తించాలని ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు కోరారు; ప్రధాని దేవగౌడ అదే ప్రకటన చేశారు. తీరా సాయం అందించే సమయంలో చేతులు బోర్లా తిప్పి, ముఖ్యమంత్రి కోరినందు వల్లనే జాతీయ విపత్తుగా ప్రకటించానన్నారు. రాష్ట్రానికి ఇంత కంటే అవమానం ఏముంది?" అని ప్రశ్నించారాయన. రాష్ట్ర ప్రభుత్వ లెక్కలను కాకి లెక్కలుగా కొట్టిపారేశారు ప్రధాని. రాజకీయ లబ్ధికోసం చంద్రబాబు ఇలా చేస్తున్నాడని అభియోగం మోపారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పరస్పరం నిందించుకొంటున్నాయని; దీని వల్ల కడకు బాధితులకు మొండి చెయ్యేనని ఆయన విమర్శించారు.

## కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంకు ఎన్నికలు

న్యాయవాది శ్రీ కె.సి.యస్. అమర్‌నాథ్ నెల్లూరు కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ అధ్యక్షులుగా రెండవ మారు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

డైరెక్టర్లుగా శ్రీ ఎ. నాగేంద్ర శాయి, వి. పురుషోత్తం, యస్. జగదీష్, ఎస్‌కె అహమ్మద్ బాషా, ఎ. ఈశ్వరయ్య, కె. శ్రీనివాస మూర్తి, బి. ముక్కంటి రాజా, డి. శ్రీనివాసులు, జె. చంద్రశేఖర రావు, శ్రీమతి వి. శాంతమ్మ, శ్రీ ఎ. రమణయ్యలు కూడా ఏకగ్రీవంగా ఎన్నికయినట్లు ఎన్నికల అధికారి శ్రీ కె.వి. నాగేశ్వరరావు ప్రకటించారు.

☛ బ్యాంకు గత 30

సంవత్సరాలుగా సి.పి.ఐ నాయకత్వంలో ఉంటున్నది. ఈసారి కూడా సి.పి.ఐ నాయకత్వాన గల పాలకవర్గమే ఎన్నిక కావడం విశేషం.

## నెల్లూరు జి.ప. హైస్కూలు విరాళం!

దర్గామిట్టలోని బాలుర పాఠశాల ఉపాధ్యాయుల నుండి రు.2841/-లు; బాలికల పాఠశాల ఉపాధ్యాయినుల నుండి రు.1584/-లు, విద్యార్థినీ విద్యార్థుల నుండి రు.1130/-లు మొత్తం రు.5565/-లు విరాళాలు సేకరించి, డిడి ద్వారా పై మొత్తాన్ని ముఖ్యమంత్రి వరద సహాయ నిధికి పంపినట్లు హెడ్మాస్టర్ శ్రీ జనార్ధనరెడ్డి తెలియ జేస్తున్నారు.

అన్ని రంగాల్లో స్త్రీలు ముందడుగు వేస్తున్న ఈ రోజుల్లో విరాళాల విషయంలో బాలికల పాఠశాల ఉపాధ్యాయినులు వెనుకబడి పోవడం ఆశ్చర్యంగా వుంది.

## "పురాణం" సంతాప సభ

శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ మృతికి సంతాప సూచకంగా సింహపురి సాంస్కృతిక అకాడమీ కస్తూర్బా కళాక్షేత్రంలో ఒక సభ ఏర్పాటు చేసింది. సభకు జాయర్ పత్రిక ఉప సంపాదకుడు శ్రీ సత్యవేణి శ్రీకాంత్ అధ్యక్షత వహించారు. శ్రీ

"నీలి" కథ ద్వారా తెలుగు కథకు అంతర్జాతీయ ఖ్యాతి ఆర్జించిన ఘనత స్వర్గీయ పురాణం సుబ్రహ్మణ్యం శర్మ గారిదేనని శ్రీ పాయసం సుబ్రహ్మణ్యం అన్నారు.

పేరులో పురాణం ఉన్నా, నవీన భావాలకు నాంది శ్రీ సుబ్రహ్మణ్య శర్మ, శేషేంద్రశర్మ వంటి కవిచేత సైతం "కామోత్సవ్" నవలను రాయించ గలిగారాయన అని ప్రముఖ రచయిత శ్రీ తిరుమూరు సుధాకర రెడ్డి అన్నారు. శ్రీ పెరుగు రామకృష్ణ మాట్లాడుతూ, శ్రీ పురాణం ఆంధ్రజ్యోతిలో వినూత్న శీర్షికలు ప్రవేశపెట్టారని అన్నారు. కథా రచయిత శ్రీ పొట్లూరి సుబ్రహ్మణ్యాం "రావిశాస్త్రి - బాకీ కథల"కి శ్రీ పురాణం వారి ప్రేరణ ఉందన్నారు. శ్రీ గుడి నారాయణ బాబు శ్రీ పురాణంను వ్యక్తిగా కాక ఒక సంస్థగా అభివర్ణించారు.

## స్త్రీలకు టైలరింగ్‌లో ఉచిత శిక్షణ

భారతి మహిళా మండలిలో టైలరింగులోను, ఎంబ్రాయిడరీ, క్రోషియా, ఊలు, ఫాబ్రిక్ పెయింటింగులోను ఉచిత శిక్షణ ఇచ్చి ఉపాధిని కల్పిస్తున్నట్లు సంస్థ క్రియా శీల సభ్యులు శ్రీమతి ఆదిరాజు సీతాదేవి, శ్రీమతి సరోజినీరావు తెలియ జేస్తున్నారు.

## చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

శంకర్ అసహ్యించుకొనే విధంగా, ఆమెను కురూపిగా మారుస్తాడు శివశక్తి. ఆమెను నానా హింసలు పెట్టాడు. వీరభద్రుడు గౌరిచేత భవానీ వ్రతం చేయించి దుర్గమ్మను ప్రత్యక్షం చేయిస్తారు. తన బాధలు దుర్గమ్మకు (భానుప్రియ) విన్నవించు కుంటుంది గౌరి. దుర్గమ్మ రౌద్ర రూపం దాల్చి దుష్టుడైన శివశక్తిని సంహరిస్తుంది. గౌరి శంకర్‌లు ఏకమవుతారు.

ఈ కథలో రెండు విచిత్రమైన పాత్రలు తటస్థ పడుతాయి. అందులో ఒకటి శంకర్ తాత పాత్ర. కల్లుత్రాగి, మద్య నిషేధం మీద విమర్శల వర్షం కురిపిస్తుంది ఈ పాత్ర. సత్రా ఈ పాత్రను బాగానే పోషించాడు. ఇక రెండవది నిద్రలో నడిచిపోయే జబ్బున్న పాత్ర. నడచిపోతూ, నిద్రపోతున్న ఆడవాళ్ల ప్రక్కలో పడుకునే పాత్ర ఇది. ఇది కేవలం హాస్యం కోసం అతికించిన పాత్ర. కుర్రోడు అనే పేరుగల ఈ పాత్రను బాబూ మోహన్ తన హాస్యధోరణిలో పోషించి నవ్వించాడు. శశికుమార్, ఊహ పోషించిన పాత్రలకు అంతగా ప్రాముఖ్యత లేదు. ఊహ గొప్పగా ఏడ్చి సరిపెట్టుకుంది. శివశక్తి పాత్రలో రామిరెడ్డి విలనీ భయంకరంగా వుంది. మంచి మంత్రగాడుగా రంగనాథ్ బాగా నటించారు.

దేవతలను, క్షుద్ర శక్తులను ఆధారంగా చేసుకొని ప్రేక్షకులను ఆకట్టుకునే విధంలో చిత్రాన్ని మలచాలన్న దర్శకుని ప్రయత్నం విఫలమైంది. స్క్రీన్‌ప్లే వ్రాసు కోవటంలోను, సన్నివేశాలను ఇమడ్చటంలోనూ దర్శకుడిలో శ్రద్ధ లోపించింది. దీనికి తోడు వందేమాతరం శ్రీనివాస్ పాటలకు కూర్చిన బాణీలు, ఏర్పరచిన నేపథ్య సంగీతం అంతంత మాత్రంగానే కుదిరాయి. జానీలాల్ ఫోటోగ్రఫీలో కూడా ప్రత్యేకత లేదు. విమలా గణేష్, దాసరి వెంకట్రావు వ్రాసిన మాటల్లో సత్తువ శూన్యం. ఈ అన్ని కారణాలతో చిత్రం నీరసంగా తయారైంది. పిలిచి పిల్లనిచ్చే తియ్యగలవన్న పేరున్న సాయిప్రకాష్ దర్శకత్వ ప్రతిభకు ఈ చిత్రం ఒక మాయని మచ్చ.

## సినిమా

9వ పేజీ కొరవ

వేసింది. దానితో మూడో రోజుకే ఆ పులి సాధువుగా మారిపోయి, షూటింగ్‌లో కన్నాంబకు ఎంతగానో సహకరించింది. ఆ చిత్రం విడుదలైనప్పుడు కరపత్రాల్లో "క్రూర మృగంతో కన్నాంబ అభినయం అపూర్వం", అంటూ అచ్చు వేయించారు.

## "కసక్"

ఆఖరికి మన చిత్రాల టైటిల్స్ ఎంత అధమ స్థాయికి దిగజారి పోతున్నాయో "కసక్" పేరు వింటేనే తెలుస్తుంది. ఒక ఇంట్లో ప్రతి రోజూ ఒక హత్య జరుగు తూంటుంది. చివరికి పోలీస్ ఆఫీసర్ చరణ్‌రాజ్ ఆ హంతకుడ్ని పట్టుకుంటాడు." అన్నారు ఈ చిత్ర దర్శకుడు ఎస్. నారాయణ. ఈయన కన్నడంలో దర్శకత్వం వహించిన హారర్ చిత్రంలో శశికుమార్, మధురిమ నాయికా నాయకులు.

## కృష్ణంరాజుకు మళ్లీ పెళ్లి

రెండేళ్ల క్రితం కారు ప్రమాదంలో భార్యను కోల్పోయిన కృష్ణంరాజు ఇటీవల మళ్లీ పెళ్లి చేసుకున్నారు.

## జనవరి 15న "ఇద్దరు"

విశ్వసుందరి ఐశ్వర్యారాయ్‌తో మణిరత్నం దర్శకత్వంలో తెలుగు, తమిళ, హిందీ భాషల్లో జనవరి 15న విడుదలయ్యే "ఇద్దరు" చిత్రంలో మోహన్‌లాల్, ప్రకాష్‌రాజ్, టాబు, గౌతమి, నాజర్, రేవతి, మధుబాల పాత్రధారులు. సమర్పణ: మురళీ మోహన్



తుఫాన్ బాధితుల కోసం తమ ఫ్యాక్టరీ తరఫున కలెక్టర్ సాంబశివరావుకు లక్ష రూపాయల విరాళమందిస్తున్న పామోలిన్ పరిశ్రమ అధినేత జెఎస్ రెడ్డి

## పామాయిల్

5 పేజీ కొరవ

ప్రారంభించారు. అదిప్పుడు కోతకు వచ్చేసింది. ఈ ఐదేళ్లుగా ఈ తోటల పట్ల రైతులలో చైతన్యం కల్గించ డానికి, విశ్వాసం ఏర్పరచ డానికి చాలా కృషి చేశారు.

నెల్లూరు వాతావరణ పరిస్థితులకు, నేల స్వభావానికి పామోలిన్ అనువైన రకమని నిరూపించారు. మొదట్లో అధికారులకే నమ్మకం లేదు. తుఫాన్లకు తట్టుకో లేదనే భయం వుండింది. కేరళ తప్ప ఇక్కడ పెరగదని, పెరిగినా దిగుబడి రాదని వదంతులు వ్యాపించి వుండినాయి. అవన్నీ వట్టి మాటలేనని రుజువై పోయిందిప్పుడు!

రైతులకు, ముఖ్యంగా మెట్ట రైతులకు నికరమైన లాభాల నిచ్చే తోటగా దీన్ని నమ్మవచ్చు. నీటి అవసరం తక్కువ. పెద్దగా తెగుళ్లు లేవు. ఒకసారి పంట మొదలైతే – కనీసం పాతికేళ్లు బ్యాంకు ఫిక్సెడ్ డిపాజిట్ నుంచి వడ్డీ తీసుకున్నంత నమ్మకంగా, సులభంగా ఏటా దిగుబడి వస్తుంది. నూనె ధర పెరిగే కొద్దీ – రైతుకు లాభం పెరుగుతుందే తప్ప తగ్గదు. కూలీల అవసరం తక్కువ. ఇన్ని లాభాలున్నాయి దీనిలో. మామిడి, కొబ్బరి తోటల కంటే రాబడి ఎక్కువ.

ఫ్యాక్టరీ తరఫున రైతులకు చాలా సౌకర్యాలు కల్పిస్తున్నారు. దక్షిణ అమెరికా దేశాల నుంచి హైబ్రిడ్ వెరైటీ విత్తనం తెప్పించి, నర్సరీ పెంచారు. [illegible] లక్ష 50 వేల మొక్కలు రెడీగా వున్నాయి. ఒక్కో మొక్క ధర రూ 40లు; కాని; సబ్సిడీ పోను రైతులు రూ 10లే [illegible] మొక్క నాటడంతో మొదలు పెట్టి, పంట కోతకు వచ్చే వరకు వ్యవసాయ సలహాలు ఫ్యాక్టరీయే ఉచితంగా ఇస్తుంది. ఏ సమస్య వచ్చినా నిపుణులు రెడీగా వుంటారు. కోసిన పంటను ఫ్యాక్టరీకి తోలుకొనే బాధ్యత కూడా వారిదే! అందువల్ల 24 గంటల వ్యవధి భయం వుండదు.

చాలినంత విస్తీర్ణంలో తోటల పెంపకం ప్రారంభం కాకపోయినా ఫ్యాక్టరీ కట్టడానికి కారణం – రైతులకు నమ్మకం కల్గించడమే! కనీసం మూడేళ్లు వీరు ఫ్యాక్టరీని ఖాళీగా పెట్టుకోవాలి. ఆ నష్టానికి సిద్ధపడి ఫ్యాక్టరీ ప్రారంభించారు.

రైతులు ముందుకు వచ్చి, పామోలిన్ తోటల పెంపకం చేపడితే – సాహసించి వ్యవసాయాధార పరిశ్రమ ప్రారంభించిన వీరు, రైతులు – లాభాలార్జించ గల్గుతారు. ప్రయత్నించి చూడండి!

## రాపూరు

5వ పేజీ కొరవ

సిఫార్సు చేయబడిన హైబ్రిడ్: ఎపిఎస్‌హెచ్ 11, బిఎస్‌హెచ్ - 1, ఎంఎస్ఎఫ్‌హెచ్ - 8 రకాలు; ఎకరానికి మామూలు వంగడాలైతే 3 నుండి 5కిలోల విత్తనం [illegible] హైబ్రిడ్ [illegible] ఎకరానికి 2 1/2కిలోలు [illegible] ఎకరానికి 44వేల మొక్కలు [illegible] మధ్య 45సెం.మీ; మొక్కల మధ్య 20 సెం.మీ దూరం ఉండాలి. [illegible] [illegible]

## 50ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

### నెల్లూరు ముచ్చట్లు
### 5గురు ఏట్లో మునిగి పోయిరి

28తేది స్వర్ణముఖి సమీపాన పారుతుండే మామిడి కాలువలో తూనుగుంట పాళెం వద్ద కావులూరు వాస్తవ్యుడు అప్పాడి రామయ్య శెట్టి కాలువను దాటబోయి మునిగి పోయెను.

సూళ్లూరు పేట వద్ద కాళంగి నదిలో కాళహస్తి వద్ద కనమనంబేడు వద్ద ఒక సిద్ధాంతిని దాటించ బోయిన నలుగురు మనుష్యులున్నూ మునిగి పోయిరి.

***

నెల్లూరు జిల్లా జమీన్‌రైతు మహాసభ జనవరి 1తేదికి వాయిదా పడింది. రంగాగారి ఉత్తరం వచ్చిన వెనక 1తేదిగాని, లేక ఒకటి రెండు రోజులు ముందు వెనకా ఉంటుందనే విషయం నిర్ధారణ అవుతుంది.

### వర్షం

నవంబరు 15తేది నుండి ఈ దినం వరకు ధారాపాతంగా వర్షం కురుస్తున్నది. చాలా గ్రామాల చెరువులు [illegible] [illegible] 24 చాలా బాగు చేసి పొయ్యేట్లుంది. ఈ దినానికి గూడా వర్షం తెరిపి ఇవ్వలేదు.

### పల్లెటూళ్లు
### తూనుగుంటపాళెం

ఊళ్లో దొడ్డిలేదు, బందెకు రసీదులేదు. అడగడానికి నోరు లేదు.

-అల్లాహో

### లేగుంటపాడు

పెద్దమిద్ది గోత నిడన కొరిదూర బారుకొన్నది. తెలిసిన సంగతే

-పడ్డకొట్టు

### రాపూరు

చుట్టు పక్కల పల్లెల్లో యిక్కడ గోశాలకు డాక్టరు చందాలు వసూలు చేస్తున్నారట. అయితే రసీదు లిస్తున్నారా?

***

సోమరాజుపల్లె నారపనాయుడు గారి ఆరాధన 12తేది జరుగును.

-శిష్యుడు

***

### కలుజువ్వలపాడు

ఆ కూలి అది అంద్రుల కొంపలకు పొయ్యే దారికడ్డం ధనికులు కట్టవేసి నీరు నింపి ఇబ్బంది పెట్టవచ్చా?





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore